


# SHAHEED-E-AZAM ASHFHAQULLA KHAN

Telugu title of this book is SHAHEED-E-AZAM ASHFHAQULLA KHAN.

In this book Life sketch and struggle of Kakori Train Incident Hero Ashfhaqulla Khan with given with some rare Photos.

This Book contains total 72 Pages of 1/8$^{th}$ Demmy Size with Multi color title published in 2006.

The unsung story of this great martyr was written first time written in Telugu language as a book in the year 2002 with total 32 pages of 1/8th Demmy, Single color title.

We are glad to bring to the notice of our Telugu Readers that SHAHEED-E-AZAM ASHFHAQULLA KHAN is translated into Urdu as SHAHEED-E-WATAN ASHFHAQULLA KHAN in the year 2010.

షహీద్-యే-ఆజమ్

# అష్ఫాఖుల్లా ఖాన్



సయ్యద్ నశీర్ అహమ్మద్



## సయ్యద్ నశీర్ అహమ్మద్


| | |
|---|---|
| తల్లిదండ్రులు | : సయ్యద్ బీబీజాన్, సయ్యద్ మీరా మొహిద్దీన్ |
| జననం | : 22 డిసెంబరు 1955 |
| పుట్టిన ఊరు | : నెల్లూరు జిల్లా పురిణి గ్రామం |
| వృత్తి | : న్యాయవాది |
| ప్రవృత్తి | : జర్నలిజం<br>(రెండు దశాబ్దాలపాటు 'ఉదయం', 'వార్త' దినపత్రికలలో, 'సిటీ కేబుల్ నెట్‌వర్క్ ప్రైవేట్ లిమిటెడ్'లో పలు బాధ్యతల నిర్వహణ.) |
| జీవిత భాగస్వామి | : షేక్ రమిజాబాను |
| సంతానం | : సయ్యద్ జాస్మిన్ అహమ్మద్<br>అల్లుడు : డా॥ ఎస్.ఎం. తల్మీజుద్దీన్ |
| సాహితీ కృషి | : ప్రముఖ తెలుగు పత్రికల్లో పలు కవితలు, కథానికలు, వ్యాసాలు |
| రచనలు | : 1. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం మహిళలు<br>2. భారత స్వాతంత్ర్యోద్యమం: ఆంధ్రప్రదేశ్ ముస్లింలు<br>3. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం ప్రజాపోరాటాలు<br>4. భారత స్వాతంత్ర్య సంగ్రామం : ముస్లిం యోధులు-1<br>5. మైసూరు పులి : టిపూ సుల్తాన్<br>6. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లింలు |
| ఆశయం | : లౌకిక ప్రజాస్వామ్య వ్యవస్థ |
| వ్యాపకం | : అధ్యయనం, రచన, ప్రచురణ, ప్రసంగాలు |
| నివాసం | : శివప్రసాద్‌స్ట్రీట్, కొత్తపేట,<br>వినుకొండ-522 647, గుంటూరు జిల్లా.<br>✆ : 08646-272411, Cell : 9440241727 |



TIP HYDERABAD

**TELUGU ISLAMIC PUBLICATIONS**
SANDESHA BHAVANAM, CHATTA BAZAR
HYDERABAD - 500 002. INDIA

ISBN 81-88241-35-0

షహీద్ - యే - ఆజమ్

# అష్ఫాఖుల్లా ఖాన్


సయ్యద్ నశీర్ అహమ్మద్

M.Com; LLB; D.P.M; D.L.L ;
Sahitya Ratna (Hindi)



తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
సందేశభవనం, లక్కడ్‌కోట్,
హైదరాబాద్-500 002.





**Shaheed-e-Azam ASHFHAQULLA KHAN**

**TIP Series No. : 140**

Written by : **Syed Naseer Ahamed**





First Edition : May 2006
Copies : 2000
ISBN : 81-88241-35-0
Published by : Telugu Islamic Publications
Sandesha Bhavanam,
Lakkadkot, Chatta Bazar,
Hyderabad-500 002. India.
Phone: 24564583
Fax : +91 +40 + 24576237
e-mail: tiphyderabad@rediffmail.com
website: www.teluguislamiclit.org
Typeset by : Geeturai Graphics
Lakkadkot, Hyderabad-2.
Printed at : : Cosmic Printers
Lakkadkot, Hyderabad-2.

**Price : Rs. 25**

## ఇందులో...







**అబ్బాదుల్లా**
డైరెక్టర్
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
సందేశభవనం, లక్కడ్‌కోట్
ఛత్తాబజార్, హైదరాబాద్-2

# మా మాట

ప్రముఖ చరిత్ర రచయిత శ్రీ సయ్యద్ నశీర్ అహ్మద్ రచించిన **'షహీద్–యే–ఆజం అష్ఫాఖుల్లా ఖాన్'** అను ఈ పుస్తకం స్వాతంత్ర్యోద్యమంలో అష్ఫాఖుల్లా ఖాన్ లాంటి యోధులు నిర్వహించిన పాత్రకు అద్దం పడుతుంది. స్వాతంత్ర్య సంగ్రామంలో అగ్ని యుగంగా భాసిల్లిన విప్లవోద్యమంలో పాల్గొన్న త్యాగ చరితులకు స్ఫూర్తి దాయకంగా నిలచిన విప్లవకారుడు, కాకోరి యోధుడు అష్ఫాఖుల్లా ఖాన్ సాహసోపేత చరిత్రను మనముందు ఉంచుతుంది.

ఈ పుస్తకం తొలుత 2002లో **'ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్'** ద్వారా ప్రచురితమైంది. ఈ పుస్తకానికి పాఠకుల, పండితుల ఆదరణ విశేషంగా లభించింది. ఆ కారణంగా మరిన్ని మార్పులు చేర్పులతో, అమూల్యమైన పలు చిత్రాలు సమకూర్చుకుని ప్రస్తుతం మళ్ళీ మీ ముందుకు వచ్చింది.

మన దేశంలో కలసిమెలసి సహజీవం సాగిస్తున్న వివిధ సాంఘిక జన సముదాయాలు తమ తమ పూర్వీకులు మాతృదేశ విముక్తి కోసం, ఆ తరువాత దేశ ప్రగతి కోసం చేసిన త్యాగాలను, సాగించిన కృషిని పరస్పరం తెలుసుకోవాల్సి ఉంది. ఆ విధంగా తెలుసుకుంటే ఆయా సముదాయాల పట్ల గౌరవభావం ఏర్పడుతుంది. ఆ గౌరవభావం నుండి సదవగాహన, సద్భావన పరిఢవిల్లుతాయి. ఆ విధంగా మత సామరస్యం మరింత పటిష్టం కాగలదని ఆశిస్తూ...

**- అబ్బాదుల్లా**

# నా మాట

**ప్రఖ్యాతి** చెందిన **కాకోరి రైలు సంఘటన** లో ఉరిశిక్షలు పడ్డాక, ఆ శిక్షల అమలు జరిగేలోపుగా, హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్ నాయకులు శ్రీ పండిత రాంప్రసాద్ బిస్మిల్ జైలులో ఆత్మకథను రాశారు. ఆ ఆత్మకథను 1927 డిసెంబరు 19న ఆయనను ఉరి తీస్తారనగా, డిసెంబరు 16న పూర్తి చేశారు. ఆ ఆత్మకథ సంబంధించిన పేపర్లను ఆనాడు విప్లవోద్యమానికి, విప్లవకారులకు అండదండలిస్తూ, తోడుగా నిలచిన **ప్రతాప్** పత్రిక సంపాదకులు శ్రీ గణేష్ శంకర్ విద్యార్థికి రహస్యంగా అందచేశారు. అలా జైలు నుండి బయటపడిన సమాచారం, ప్రతాప్ పత్రిక ప్రెస్సు ద్వారా 1928లో పుస్తకంగా వెలువడింది. ఈ పుస్తకాన్ని అప్పటి బ్రిటీష్ ప్రభుత్వం నిషేధించింది. ఆ నిషేధం అమలులోకి వచ్చేసరికి ప్రథమ ముద్రణ కాపీలన్నీ ప్రజలలోకి వెళ్ళిపోయాయి. ప్రజాదరణ ఫలితంగా ద్వితీయ ముద్రణ ఆరంభమైంది. కాని ప్రభుత్వ నిషేధం ఫలితంగా అప్పట్లో ద్వితీయ ముద్రణ పూర్తికాలేదు.

ఆ ఆత్మకథలో పండిత రాంప్రసాద్ బిస్మిల్ విప్లవోద్యమంలో తన ప్రవేశం నుండి, తనతోపాటు విప్లవోద్యమాన్ని మండించిన మిగతా సహచరుల గురించి చాలా వివరాలందించారు. ఆయన తన సహచర విప్లవకారుడు **అష్ఫాఖుల్లా ఖాన్** గురించి ప్రత్యేక అధ్యయాన్ని కేటాయించి, అష్ఫాఖ్ పాత్రను వివరంగా పేర్కొన్నారు. ఆ తరువాత కాకోరి రైలు సంఘటలో పాల్గొని, పలు శిక్షలు అనుభవించిన విప్లవయోధులు అష్ఫాఖుల్లా, ఇతరుల విప్లవ యోధుల గురించి పలు పుస్తకాలు రాశారు. ఆ పుస్తకాల ఆధారంగా శ్రీ సుధీర్ విద్యార్థి 1988లో Shaheed Asfaqulla Khan Aur Unka Yug అను గ్రంథాన్ని రాశారు.

1999లో అష్ఫాఖుల్లా ఖాన్ **శత జయంతి** వచ్చింది. నా ప్రయత్నం మేరకు రాష్ట్రంలో పలు ప్రాంతాలలో, సభలు–సమావేశాలు జరిగాయి. ఆ సందర్భంగా అష్ఫాఖ్ గురించి ప్రజలకు పరిచయం చేయాలన్న లక్ష్యంతో వివిధ కోణాల నుండి ఆయన మీద వ్యాసాలను రాసి పలు పత్రికల ద్వారా పాఠకులకు అందించాను. ఆ ప్రయత్నానికి మంచి స్పందన వచ్చింది. ఆ స్పందన నేపథ్యంలో, **ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్,** ఛైర్మన్ హాజీ షేక్ పీర్ అహమ్మద్ ప్రోత్సాహంతో, విజయవాడకు చెందిన డాక్టర్ దంపతులు జనాబ్ యం.ఎ రహమాన్, సయ్యద్ అఫ్రషీన్‌ల చేయూతతో **షహీద్–యే–ఆజం అష్ఫాఖుల్లా ఖాన్** పుస్తకాన్ని రాశాను. చివరకు ఈ పుస్తకం 2002 ఆగస్టులో తొలిసారిగా ప్రచురితమైంది.



ఆ తరువాత అష్ఫాఖుల్లా ఖాన్ సోదరుని మనుమడు గురించి, ప్రజాసాహితి మాసపత్రిక సంపాదకులు శ్రీ నిర్మలానంద ద్వారా తెలుసుకున్నాను. ఈ యువకుడి పేరు కూడా అష్ఫాఖుల్లా ఖాన్. ఆయన ఉత్తర ప్రదేశ్‌లోని షాజహాన్‌పూర్‌లో ఉంటున్నారు. ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. టెలిఫోన్ సంభాషణలు సాగాయి. ఆ పరిచయం మూలంగా కాకోరి వీరుడు అష్ఫాఖుల్లా ఖాన్ గురించి మరిన్ని వివరాలు తెలిశాయి. ఆయన 2003 డిసెంబరు 19న మిత్రుడు జనాబ్ ఫశీయుద్దీన్ విశాఖపట్నంలో నిర్వహించిన అష్ఫాఖుల్లా ఖాన్ సంస్మరణ సభకు వచ్చారు. ఆ సభకు నేను కూడా వక్తగా హాజరయ్యాను. ఆ సందర్భంగా స్వాతంత్ర్య సంగ్రామయోధులు అష్ఫాఖుల్లా ఖాన్ గురించి ఆయన మనుమడు అష్ఫాఖుల్లా ఖాన్ నుండి పలు విషయాలు ప్రత్యక్షంగా తెలుసుకున్నాను.

బహుళ ప్రజాదరణ పొందిన **షహీద్- యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్** గ్రంథం ప్రాముఖ్యతను గుర్తించిన **తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్** సంచాలకులు **జనాబ్ అబ్బాదుల్లా** ఈ పుస్తకాన్ని సరికొత్తగా ప్రచురించేందుకు ప్రతిపాదించారు. సంతోషంగా సరేనన్నాను. ఆనాటి పుస్తకాన్ని నూతన సమాచారంతో, పలు చిత్రాలతో సరికొత్తగా రూపకల్పన చేశాను. ఆ సందర్భంగా Shaheed Asfaqulla Khan Aur Unka Yug (Hindi), మరికొన్ని హిందీ–ఆంగ్ల గ్రంథాల నుండి సమాచారం స్వీకరించాను. ఆ సమాచారంతో **షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్** పుస్తకాన్ని దాదాపు తిరగరాశాను. ఆ శ్రమ ఫలితంగా సరికొత్త సమాచారం, నూతన చిత్రాలు, ఫోటోలతో సరికొత్త పుస్తకం మీ చేతుల్లోకి చేరింది.

ఈ ప్రయత్నంలో నాకు తోడ్పాటు అందించిన **తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్** సంచాలకులు **జనాబ్ అబ్బాదులా** గారికి, సహకరించిన **జనాబ్ వాహెద్** (గీటురాయి– హైదరాబాదు) గారికి, పరిచయ వాక్యం రాసిచ్చిన ప్రముఖ రచయిత శ్రీ డి. నటరాజ్ (అసిస్టెంట్ రిజిస్ట్రార్, ఆంధ్రవిశ్వవిద్యాలయం, విశాఖపట్నం) గారికి, నా రచనా వ్యాసంగంలో సదా నన్ను ప్రోత్సహిస్తూ, అన్ని విధాల సహకరిస్తున్న నా జీవిత సహచరిణి శ్రీమతి షేక్ రమిజా బానుకు నా హృదయపూర్వక ధన్యవాదాలు.

**ఇక... ఈ గ్రంథం గురించి తీర్పు చెప్పాల్సింది పాఠకులే !**

**- సయ్యద్ నశీర్ అహమ్మద్**

వినుకొండ,

మే, 2006.




**డి. నటరాజ్,**
ప్రముఖ రచయిత,
అసిస్టెంట్ రిజిస్ట్రార్, ఆంధ్ర విశ్వవిద్యాలయం,
విశాఖపట్నం.


# పరిచయ వాక్యం

భారత స్వాతంత్ర్యోద్యమ పోరాట చరిత్రలో యెన్నిసార్లు చదివినా తనివితీరని భాగాలు అనాటి విప్లవకారుల పోరాటాలు, త్యాగాలు. ఆ చరిత్రలో ఒక్కొక్కరూ ఒక్కొక్క మణిదీపం. మనకు భగత్ సింగ్, రాజగురు, ఆజాద్.. మాత్రమే ఎక్కువ పరిచయం. కానీ వీరికంటే నాలుగు సంవత్సరాల క్రితమే జరిగిన విప్లవ పోరాటంలో వీరోచితంగా పాల్గొని తెల్ల ముష్కరులను ముప్పుతిప్పలు పెట్టిన–చెప్పాలంటే సర్దార్ భగత్ సింగ్‌కు కూడా స్ఫూర్తినిచ్చిన అమర వీరుడు అష్ఫాఖుల్లా ఖాన్. ఆ యోధుని త్యాగచరిత్రను యెంతో ప్రయాసపడి శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ పుస్తక రూపం కల్పించారు. ఈ గ్రంథంలో అష్ఫాఖుల్లా ఖాన్ చరిత్రను, ఆయన భావనలను చక్కని శైలిలో కవితాత్మకంగా వ్యక్తీకరించి, ఆనాటి సంఘటనలను రచయిత దృశ్యీకరించి పాఠకులకు అందించారు. ఈ పుస్తకం ఆరంభించాక చివరి వరకు పురకలు పెట్టించి, చివరికి వచ్చేసరికి చదువరులలో చెరగని ముద్ర వేసేవిధంగా పఠనశీలతను కల్పించారు.

నాటి చరిత్రలో అష్ఫాఖుల్లా ఖాన్‌కు వున్న ప్రత్యేకతనూ, అతని విశాల హృదయాన్నీ, ముందుచూపునూ, పట్టుదలనూ, త్యాగాన్ని తెలిపే ఏ విషయాన్ని వదలకుండా రచయిత అందించారు మనకీ పుస్తకంలో. ఆనాటి సంఘటన కార్యాకారణ సంబంధాలను పొందు పర్చటంలో కూడా చక్కని క్రమాన్ని పాటించారు. ఈ పుస్తకం చదివాక చాలాసార్లు అన్పిస్తుంది, అష్ఫాఖుల్లా ఖాన్ అంతటి త్యాగం చేయకుండా వుంటే, ఆనాటి విప్లవ చరిత్ర గొప్ప మలుపు తిరిగేది కాదు. చాలా భావాలలో ఆయన భగత్ సింగ్ కన్నా ముందున్నారు. అష్ఫాఖుల్లా ఖాన్ అన్ని రంగాలలో సమానత్వాన్ని ఆక్షాంక్షించాడు. ఆ దిశగా అలోచనలు సాగించిన ఆయన భారత దేశ చరిత్ర యే విధంగా ముందుకుసాగితే సమసమాజం ఉద్భవిస్తుందో ముందుగానే వూహించాడు. ఉగ్రవాద చర్యల కన్నా ప్రజాబలం మీదనే విప్లవాలు నడపబూనడం, ప్రజలలో మార్పుకోసం కృషి చేయడం ఎక్కువ ముఖ్యమని తలచి సమావేశాల్లో ఆయన తన అభిప్రాయాన్ని వ్యక్తం చేయడం, తన వాదనలు వీగిపోయినా సంఘంలోని ప్రజాస్వామ్య ధర్మాలను కాదనకుండా ప్రాణాంతక చర్యలను కూడా అంగీకరించటం, ఆ కార్యసాధనకు దృఢదీక్షతో శ్రమించటం అబ్బురమన్పిస్తాయి.

అష్ఫాఖుల్లా ఖాన్ జమీందారీ కుటుంబంలో 1900 అక్టోబరు 22న పుట్టాడు. ఆయన ఏడవ తరగతి చదువుతున్నప్పుడు ఆతడికి మొట్టమొదటసారిగా విప్లవోద్యమం పట్ల ఆసక్తి కలిగింది. అతనికి, మొదట్లో చిన్నపాటి దళంగా వుంటే విప్లవకారులు, తమకున్న కొద్దిపాటి



తుపాకులతో బలమైన బ్రిటీష్ ప్రభుత్వాన్ని ఎదుర్కొనగలరా ? అని అనుమానంగా వుండేది. యెన్నో అనుమానాలు ముప్పిరిగొనేవి. తనూ వొక వీరుడిగా చనిపోవాలని వుండేది. విప్లవకారుల నెవరినైనా కలుసుకోవాలని ఆయన తపించిపోయాడు. యెంతో కష్టంతో ఆనాటి విప్లవోద్యమ నాయకుడు శ్రీ రాంప్రసాద్ బిస్మిల్‌ను కలుసుకున్నాడు. ఆతడు ఆర్యసమాజ భావాలు కలవాడు. ముస్లింల పట్ల అపోహలు కలవాడు. దాంతో ఆయన అష్ఫాఖుల్లాను సరిగా ఆహ్వానించలేదు. అసలు నమ్మలేదు. అయితే అష్ఫాఖుల్లా దేశభక్తి అన్ని అడ్డంకులనూ అధిగమించేట్టు చేసింది. ఆ తరువాత విప్లవోద్యమంలో అష్ఫాఖ్ శ్రీ బిస్మిల్ మంచి స్నేహితులు అయ్యారు. ఈ ఇరువురు స్నేహితులైన లగాయితు చివరకి ఆ మిత్రులు ఉరికంబం ఎక్కేంత వరకు యీ పుస్తకాన్ని వాస్తవ చరిత్రతో అందిస్తూ రచయిత అద్భుతంగా నడిపారు.

ఆనాటి ఉద్యకారుల ఉద్యమదీప్తి గురించి తెలుసుకోవాలనుకున్నా, అనాటి ముస్లిం యువకుల దేశభక్తి గురించి తెలుసుకోవాలన్నా యీ పుస్తకం అవశ్యం పఠనీయం. ఈ పుస్తకం అష్ఫాఖుల్లాకు సంబంధించిందైనా, ఆనాటి ఉద్యమచరిత్రలో భాగంగా గ్రహించేందుకు ఈ పుస్తకం పాఠకులకు విలువైన సమాచారాన్ని అందిస్తుంది. ఆనాటి అష్ఫాఖుల్లా ఖాన్ త్యాగం, అనేక మంది యువకిశోరాల్ని సృష్టించింది. యే చారిత్రక మార్పుకైనా ముస్లిం తన స్నేహహస్తం అందించాడంటే ఆ చారిత్రక మార్పు తథ్యం. యిది చరిత్ర చెప్పిన సత్యం. కానీ భారత దేశం ముస్లింలు చేసిన త్యాగాల్ని, ముస్లింలు నిర్వహించిన విశేష నాయకత్వాన్ని, చూపిన పోరాట పటిమను మర్చిపోయింది. ఫలితంగా సంకుచిత ధోరణలు పెరిగిపోయి విభిన్నతలోని అందాన్ని, సౌజన్య గుణాన్ని అస్వాదించే అసాధ్యమైన ఆవకాశాన్ని దేశ ప్రజలు జారవిడుచుకున్నట్లయ్యింది. ఆనాటి ముస్లిం త్యాగాలు సరిగ్గా అక్షరబద్ధం కాకపోవటం వల్లే ఈ దుస్థితికి కారణం. ఆ లోటును పూరించేందుకు స్థానిక భాషలో చరిత్ర రచనసాగాలని ప్రచారకార్యక్రమాన్ని చేపట్టిన సయ్యద్ నశీర్ అహమ్మద్ తనవంతు కృషిగా విస్మరించబడిన జనసముదాయాల చరిత్రను వెలికితీసి సామాన్య ప్రజలకు అందుబాటులోకి తెస్తున్నారు. ఆ కృషిలో భాగంగానే ప్రస్తుతం వెలువడిన **'షహీద్–యే–ఆజం అష్ఫాఖుల్లా ఖాన్ '** గ్రంథం.

ఈ పుస్తకంలో అష్ఫాఖుల్లా జీవిత చరిత్రోని ప్రధాన ఘట్టాలకు పెట్టిన శీర్షికలు యెంతో భావగర్భితంగా ఉన్నాయి. అష్ఫాఖుల్లా ఖాన్ చిత్రంతో పాటుగా, శ్రీ రాంప్రసాద్ బిస్మిల్ చిత్రం పుస్తకంలో ఉంది. విప్లవోద్యమ ఘట్టాలను తెలుపు చిత్రాలతోపాటుగా అష్ఫాఖుల్లా భౌతికాయం ఫోటో కూడా రచయిత సంపాదించి పొందుపర్చారు. అష్ఫాఖుల్లాకు సంబంధించిన పలు విలువైన ఫోటోలు–చిత్రాలు పుస్తకంలో చోటుచేసుకుని పుస్తకం విలువను మరింతగా పెంచాయి. స్వాతంత్ర్య సమర జ్యోతి అష్ఫాఖుల్లా ఖాన్ మీద ఇంత చక్కని పుస్తకాన్ని రచించిన సయ్యద్ నశీర్ అహమ్మద్‌కు, పుస్తక ప్రచురణకర్తలను ఈ సందర్భంగా అభినందించక తప్పదు. ఈ పుస్తకానికి అటు సామాన్య పాఠకుల ఇటు పండిత ప్రముఖుల ఆశీస్సులు పుష్కలంగా లభిస్తాయనటంలో ఎటువంటి సందేహం లేదు.

◆◆◆



## షహీద్-యే-ఆజమ్

# అష్ఫాఖుల్లా ఖాన్

మహాత్మాగాంధీ భారత రాజకీయరంగ ప్రవేశం చేసాక సహాయ నిరాకరణ ఉద్యమం ప్రారంభించి, బ్రిటీష్ వ్యతిరేక పోరాటానికి శ్రీకారం చుట్టారు. ఈ ఉద్యమంలో బహుళ సంఖ్యలో ప్రజలు పాల్గొన్నారు. మాతృభూమి విముక్తికి సాయధ పోరాటమే మార్గమనుకున్న విప్లవకారులు కూడా తమ ఆయుధాలను ఆవలపెట్టి ఉద్యమంలో ఉత్సాహంగా భాగస్వాములయ్యారు. భరతగడ్డ మీది ప్రజలంతా ఏకోన్ముఖంగా ఉద్యమించడంతో సహాయ నిరాకరణ ఉద్యమం పతాక స్థాయికి చేరుకుంది.

ప్రజలు తెగించి ఎంతటి సాహసానికైనా సమాయత్తం అవుతున్న సమయంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని చౌరీచౌరాలో జమీందారులకు వత్తాసు పలికిన పోలీసులు, ఇరువురు ఉద్యమకారులను పొట్టనపెట్టుకున్నారు. ఈ దుర్ఘటనతో ఆగ్రహించిన ప్రజలు పోలీసు స్టేషన్‌ను చుట్టుముట్టారు. పోలీసులు కాల్పులు జరుపగా ప్రజలు ప్రతీకార





చర్యగా తిరగబడి స్టేషన్ తగులబెట్టడంతో పలువురు పోలీసులు మరణించారు. ఈ సంఘటనతో గాంధీజీ సహాయనిరాకరణ ఉద్యమాన్ని విరమించారు. గాంధీజీ తీసుకున్న ఈ నిర్ణయం పట్ల దేశవ్యాప్తంగా నిరసన వ్యక్తమైంది. జాతీయ కాంగ్రెస్ నాయకులతోపాటు, యువకులకు, విప్లవకారులకు గాంధీజీ నిర్ణయం ఏ మాత్రం నచ్చలేదు. ఆ తరువాత కొంత కాలం వరకు భారత జాతీయ కాంగ్రెస్ ఎటువంటి పోరాటానికి పిలుపు ఇవ్వక పోవడం, జాతీయ కాంగ్రెస్ నాయకులలో తలెత్తిన అభిప్రాయభేదాల మూలంగా జాతీయోద్యమం స్థబ్దతకు గురైంది.

గాంధీజీ నిర్ణయం ప్రజోద్యమాన్ని నీరుకార్చిందని భావించిన యువకులు, విప్లవకారులు దాస్యవిముక్తికి సాయుధపోరాటం తప్ప మరో మార్గం లేదన్న నిర్ణయానికి వచ్చారు. ఆవలపెట్టిన ఆయుధాలను తిరిగి అందుకున్నారు. ఈ మేరకు సాగిన విప్లవ కార్యకలాపాలలో భాగంగా జరిగిన **కాకోరీ రైలు దోపిడి** సంఘటన ప్రభుత్వంలో ప్రకంపనాలను సృష్టించింది. ఈ చర్య ద్వారా బ్రిటీష్ పోలీసు వ్యవస్థకు విప్లవకారులు సవాలు విసిరారు. శతృవుకు కంటిమీద కునుకు లేకుండా చేసారు. అపూర్వ సాహసంతో విప్లవ కారులు, స్వాతంత్ర్య స్ఫూర్తిని కాపాడుతూ, రాజకీయ స్థబ్దతను బద్దలు కొట్టారు.

కాకోరి రైలు దోపిడి సంఘటనతో కంగారు పడిన పాలకవర్గం, ప్రజల మీద, విప్లవకారుల మీద దారుణంగా విరుచుకుపడింది. ఈ సంఘటన పురస్కరించుకుని న్యాయస్థానంలో జరిగిన విచారణ ప్రజలలో అమితాసక్తికి కారణమైంది. విప్లవయోధులు కేసు విచారణ సందర్భంగా ప్రదర్శించిన నిర్భీతి, ఆ తరువాత నవ్వుతూ, తుళ్ళుతూ ఉరి శిక్షలను స్వీకరించిన విధానం జాతీయోద్యమానికి ప్రాణ ప్రతిష్ట చేసాయి. **అగ్నియుగంగా** చరిత్రకారులచేత కీర్తించబడిన విప్లవోద్యమ కాలంలో **కాకోరీ రైలు సంఘటన** కలికితురాయిగా నిలిచిపోయింది.

ఈ చారిత్రాత్మక యాక్షన్‌ను నిర్వహించిన **హిందూస్తాన్ రిపబ్లికన్ అసోసియేషన్** లో సభ్యునిగా అష్ఫాఖుల్లా ఖాన్ ప్రముఖ పాత్ర వహించారు. మాతృభూమి విముక్తి కోసం సాగిన సాయుధ పోరాటంలో ప్రాణాలను తృణప్రాయంగా భావించి బ్రిటీష్ వలస పాలకులపై విప్లవించి అమరత్వం పొందిన యువ యోధులలో అష్ఫాఖుల్లా ఖాన్ ఒకరు. ఆ వీరకిశోరం తన అపూర్వమైన బలిదానంతో యువకుల్లో దేశాభిమానాన్ని ప్రజ్వరిల్లచేసి 27 సంవత్సరాల వయస్సులో అమరుడయ్యారు.

# అష్ఫాఖ్ జననం - బాల్యం

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ కాలం నుండి వీరపుత్రులను అందిస్తున్న ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని షాజహాన్‌పూర్‌లో 1900 సంవత్సరం అక్టోబరు 22వ తేదిన విద్యాధిక – సంపన్న జమీందారి కుటుంబంలో అష్ఫాఖుల్లా ఖాన్ జన్మించారు. ఆయన తల్లి మజహరున్నీసా బేగం. తండ్రి షఫీఖుల్లా ఖాన్. ఉన్నత ప్రభుత్వ ఉద్యోగులైన ఆ కుటుంబ సభ్యులు రాజకీయాలకు కడుదూరం.

అష్ఫాఖ్ తల్లిదండ్రుల చివరి సంతానం. అతిగారాబంగా పెరిగారు. అష్ఫాఖ్ పొడుగాటి మనిషి, విశాలమైన ఛాతి, ధృఢమైన శరీరం. సింహబలుడు. స్ఫురద్రూపి. మృదువైన మాటతీరుతో స్నేహపూర్వక ప్రవర్తనతో, మంచి వస్త్రధారణతో ప్రతి ఒక్కరిని ఆకట్టుకునే రూపం ఆయనది.

అష్ఫాఖ్ షాజహాన్‌పూర్‌లో గల **అబ్బీ రిచ్ మిషన్ హైస్కూల్** లో (Abbie Rich Mission High School) ఎనిమిదవ తరగతి వరకు చదివారు. ఆయన **చదువు కంటే ఈత, గుర్రపుస్వారి, వేటలోనే ఎక్కువ అభిరుచి చూపేవారు. చిన్నప్పుడు కొంత తుంటరిగా ప్రవర్తించకపోలేదు. కానీ అప్పటి నుండే దయాదాక్షిణ్యాలు, సేవాభావం అతనిలో మూర్తీభ వించి ఉండేవి.** (బిస్మిల్ ఆత్మకధ, హిందీ మూలం : శ్రీ రాం ప్రసాద్ బిస్మిల్, తెలుగుసేత: శ్రీ ఇంగువ మల్లికార్జున శర్మ, మార్క్సిస్టు అధ్యయన వేదిక, హైదరాబాదు, 1989, పేజి. 150) అష్ఫాఖ్ ఆటపాటలంటే మహాఇష్టం. ఆయన మంచి హాకీ ఆటగాడు. ప్రతిరోజు కసరత్తు చేసి మంచి దేహధారుధ్యాన్ని సంతరించుకున్న బలశాలి.

అష్ఫాఖుల్లా ఖాన్ తల్లి మహజరున్నిసా మంచి చదువరి. అమె పలు గ్రంథాలను అధ్యయనం చేయటమే కాకుండా, పలు పత్రికలను కూడా తెప్పించుకుని పఠిస్తూ, ఆ ఇంట వార్తా విశేషాల చర్చించటం అమె అలవాటు. ఆయా విశేషాలను కథలుగా తన చిన్న కుమారుడు అష్ఫాఖుల్లాకు చెబుతూ రావటం వలన చిన్నతనం నుండి అష్ఫాఖ్ కూడా మంచి చదువరయ్యారు. తల్లి వద్ద ఉన్న ఉర్దూ గ్రంథాలను ఆమె సహాయంతో అధ్యయనం చేశారు. ఆ అధ్యయనం అష్ఫాఖ్‌లో స్వేచ్ఛాస్వాతంత్ర్య భావనలకు పునాది వేసింది. ఆ కారణంగా ఆయన తన జమీందారి కుటుంబ సభ్యుల ప్రవర్తనకు, ఆ ప్రత్యేక వాతావరణానికి, ఆ సంస్కృతికి దూరంగానూ, తన సోదరుల వ్యవహారసరళికి చాలా భిన్నంగా ప్రవర్తించటం ఆరంభించారు.





అష్ఫాఖ్‌ను సంప్రదాయ–ధార్మిక విద్యలో సుశిక్షుతుడ్ని చేసేందుకు తల్లి తండ్రులు ప్రత్యేకంగా ట్యూటర్‌ను ఏర్పాటు చేశారు. ట్యూటర్‌గా నిమమించబడిన మౌల్వీ సాహెబ్ పాతతరం మనిషి. ఆయన తొలుత నుండి ఆంగ్లేయులకు, ఆంగ్లేయ సంస్కృతికి బద్ధ వ్యతిరేకి. ఆంగ్లేయులతో స్నేహం చేసినట్టయితే నరకానికి పోతామన్న తీవ్ర భావలను కలిగిన ఆయన ప్రభావం అష్ఫాఖ్ మీద బాగా పడింది. మౌల్వీ బ్రిటీష్ ఉత్పత్తులను ఎన్నడూ అంగీకరించేవారు కాదు. స్వదేశీ ఉత్పత్తులను వాడాల్సిందిగా ఆయన తన శిష్యులకు బోధించేవారు. ఈ పరిస్థితుల వలన అష్ఫాఖుల్లా మౌల్వీ వద్ద ధార్మిక విద్యను నేర్వటం కంటే బ్రిటీష్ వ్యతిరేక భావాలను బాగా అలవర్చుకున్నారు. (Shaheed Ashfhaqulla Khan Aur Unka Yug (Political Biography), By Sudhir Vidyarthi, Sandhrabha Prakasan, Shajahanpur, 1988, Page.17)

ఆ భావాల ప్రభావంతో, ఆంగ్లేయులను పరాజితుల్ని చేసేందుకు టర్కీ, ఆఫ్ఘనిస్థాన్ అధినేతలు ఇండియా మీద దాడిచేసి బ్రిటీష్ ప్రభుత్వాన్ని కూలదోయాలని అష్ఫాఖ్ తొలి రోజులలో ఆశించారు. ఆ విధంగా టర్కీ, అఫ్ఘనిస్థాన్ దేశాధినేతలు యుద్ధం ప్రకటించి తరలి వచ్చినట్టయితే వారితో కలసి బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడాలని ఆయన భావించారు. మతాభివేశంతో వ్యక్తమైన అష్ఫాఖ్‌లోని ఈ ఆకాంక్ష ఆ తరువాత త్వరితగతిన ఆవిరైపోయింది. ఆ తరువాతి కాలంలో, అటువంటి అభిప్రాయాలు తనలో కలిగినందుకు తనను, ఆ అభిప్రాయాలు కలుగచేసిన వ్యక్తులను ఆయన స్వయంగా నిందించారు. (Shaheed Ashfhaqulla Khan Aur Unka Yug, Page.18)

# విముక్తి పోరాట కార్యకలాపాల పరిచయం

అష్ఫాఖుల్లా ఖాన్ ఏడవ తరగతి చదువుతున్నప్పుడు, ఆ పాఠశాలలో జరిగిన ఒక సంఘటన ఆయనలోని ఉద్యమకారుడ్ని మేల్కొలిపింది. ఆయన జీవిత గమనానికి ఆ సంఘటన మార్గం చూపింది. ఒకరోజు అష్ఫాఖ్ పాఠశాలకు వెళ్ళేసరికి, పాఠశాల ఆవరణ అంతా పోలీసులతో నిండి ఉంది. పోలీసులు ఎవరికోసమో వెతుకుతున్నారు. ఈ హడావుడి ఆసక్తి కలిగించింది. విషయమేంటని విచారించగా పదవ తరగతి చదువు తున్న రాజారాం అనే విద్యార్థి కోసం పోలీసులు వచ్చారని, **మైన్‌పూరి దోపిడి** కేసులో అతడు నిందితుడని ఓ స్నేహితుడు చెప్పాడు. రాజారాంను పోలీసులు పట్టుకెళ్ళడానికి కారణం ఆయన దొంగ కాదని అన్నాడు. ఈ పాఠశాలలో రాజారాం లాంటి విద్యార్థులు

చాలామంది ఉన్నారన్నాడు. బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేసే రహస్య దళాలలో వీరు సభ్యులని, ప్రభుత్వ పక్షం వహించే ధనికులను వారు దోచుకుంటున్నారని తెలిపాడు. రాజారాం లాంటి యువకులు మాతృభూమి పట్ల అపార గౌరవం, ప్రజల పట్ల ప్రేమ కలిగిన వారు, బ్రిటీషు ప్రభుత్వం గాని, ఆ ప్రభుత్వానికి వంతపాడే వ్యక్తులకు గాని విప్లవకారులు వ్యతిరేకమని ఆ మిత్రుడు వివరించాడు.

ఆ వివరాలు అష్ఫాఖ్‌లో ఆసక్తిని రెకెత్తించాయి. ఈ సందర్భంగా ఆ మిత్రుడితో ఆయన హాస్యమాడుతూ, **నీవు కూడా రహస్య దళంలోని సభ్యుడవని తెలిస్తే నిన్ను కూడా అరెస్టు చేయించేవాడ్ని** అన్నారు. అందుకు బదులుగా అతడు **ఆ విప్లవకారుల మాదిరిగా తాను కూడా దేశం కోసం మరణించడానికి కూడా సిద్ధంగా ఉన్నానని** అన్నాడు. ఆ మిత్రుడు యథాలాపంగా అన్న మాటలతో అష్ఫాఖ్ ఆశ్చర్యానికి లోనయ్యారు. ఆ మాటలు ఆయన మనస్సును పట్టేశాయి.

ఆ క్రమంలో మంచి చదువరి అయిన అష్ఫాఖ్ పలు పుస్తకాలు, పత్రికల ద్వారా దేశంలో బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమాలు-పోరాటాల గురించి తెలుసుకోసాగారు. ఆ పోరాటాలలో బెంగాల్‌కు చెందిన విప్లవకారుల సాహసాలు, శ్రీ ఖుదీరాం బోస్, శ్రీ కన్హయలాల్ లాంటి యోధుల ప్రాణత్యాగాల గురించి తెలుసుకున్న అష్ఫాఖ్ తాను కూడా అంతటివాడు కావాలని, ఆ వీరుల్లాగే మాతృభూమి కోసం పోరాడాలని, ప్రాణాలు అర్పించాలని కలలు కనడం ప్రారంభించారు.

అష్ఫాఖుల్లా ఖాన్ విప్లవోద్యమానికి ఆకర్షితులైనా, ఆ ఉద్యమాల విజయం మీద పలు అనుమానాలుండేవి. గుప్పెడు మంది కూడా లేని రహస్యదళ సభ్యులు, కొన్ని తుపాకులతో, మరికొన్ని ఆయుధాలతో అన్ని రకాల ఆయుధాలు, అంగబలం గల బ్రిటీష్ ప్రభుత్వాన్ని ఎదుర్కోగలరా? ఆ విధంగా శత్రువును ఎదుర్కొని విజయం సాధించగలమా? అది సాధ్యమా? విప్లవకారుల సాహసాలు, త్యాగాలు సత్ఫలితాలను సాధించగలవా? అనే ప్రశ్నలు ఆయనను వేధించసాగాయి. ఆ ప్రశ్నలకు సమాధానం అందక సతమత మవుతున్నా ఆయన మస్తిష్కం మహాత్ముడు ఆరంభించిన సహాయనిరాకరణోద్యమం దిశగా ఆకర్షించబడింది. అష్ఫాఖుల్లా ఖాన్ పాఠశాల విద్యార్థిగా బ్రిటీష్ వ్యతిరేక ఉద్యమంలో పాల్గొనాలనుకున్నారు. ఆ ప్రయత్నంలో భాగంగా తనకు పరిచయం అయిన సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొని సాహసోపేత స్వాతంత్ర్య సమరయోధుని జీవితాన్ని చిన్ననాటనే ఆరంభించారు. (Great Revolutionary Martyr Ashfaqullah Khan, Bhasha Sangam, Allahabad, 2001, Page.5)





# సహాయ నిరాకరణోద్యంలో భాగస్వామి

పరాయి పాలకులు స్వజనుల మీద సాగిస్తున్న పెత్తనం, జులుంను గమనిస్తున్న అష్ఫాఖుల్లా స్వేచ్ఛ-స్వాతంత్ర్యాల కోసం సాగుతున్న బ్రిటీషు వ్యతిరేక పోరాటాల పట్ల ఆకర్షితు లయ్యారు. గాంధీజీ నాయకత్వంలో సాగుతున్న ఉద్యమంలో ఆయన పాఠశాల విద్యార్థిగా పాల్గొన్నారు. బ్రిటీషర్ల బానిసత్వానికి ప్రతీకలైన ఏ వస్తువును కూడా ఇక వాడరాదని ఆయన నిర్ణయించుకున్నారు. ఆంగ్లేయుల వస్త్రాలు మాత్రమే కాదు, వారి వస్త్రధారణను కూడా ఆయన వ్యతిరేకించారు. స్వదేశీ వస్తువులను మాత్రమే వాడమన్నారు. మాతృదేశం కోసం జీవించమంటూ ప్రచారం ఆరంభించారు.



ఈ చర్య ఆయన కుటుంబీకులకు నచ్చలేదు. ఎంతగా చెప్పినా ఆష్ఫాఖ్ మాట వినలేదు. చివరకు మిషన్ స్కూల్ నుండి ఆయనను బహిష్కరించారు. అష్ఫాఖ్ కుటుంబీకులంతా ఉన్నత విద్యావంతులు కావటం, ఆయన మాత్రం చదువు పట్ల అంతగా శ్రద్ధ చూపకపోవటం, బ్రిటీషు ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాలలో భాగస్వామి కావటం పట్ల కుటుంబీకులు ఆగ్రహించారు. తల్లి తండ్రులు మాత్రమేకాదు ఆయన చదువుతున్న Abbie Rich Mission High School ప్రధానోపాధ్యాపకుడు కూడా ఆగ్రహించి ఆయనను పాఠశాల నుండి బహిష్కరించారు.

ఆ బహిష్కరణకు ఆయన బాధపడలేదు. అంతలో గాంధీజి సహాయనిరాకరణ ఉద్యమాన్ని విరమించారు. ఆ చర్యతో ఆయన మస్తిష్కాన్ని విప్లవోద్యమ భావాలు చుట్టుముట్టాయి. అతి కొద్దిమంది ఆయుధాలతో పోరాడి ఆంగ్లేయ ప్రభుత్వానికి చరమగీతం పాడగలరా ? అన్న ప్రశ్న పునరావృతమైంది. ఆ సమయంలో ఒక విప్లవకారుని వీరోచిత చర్య శత్రుసైన్యం విధ్యంసం నుండి ఆయన తన దేశాన్ని ఎలా కాపాడిందో తెలుపు పుస్తకం **లవ్ ఆఫ్ కంట్రీ** ఆయన లభించింది. ఆ పుస్తకంలో శత్రుసైన్యం తన దేశం మీద విరుచుకుపడుతున్నప్పుడు ముగ్గురు మిత్రుల సహకారంతో **దర్బన్ నది** మీదున్న వంతెనను విధ్వంసం చేసి, శత్రుసైనికులను నగరంలోకి ప్రవేశింపనివ్వకుండా నిలువరించి,

తన ప్రజలను కాపాడుకున్న **విప్లవకారుడు హారిసన్** పాత్ర అష్ఫాఖ్‌ను బాగా ఆకర్షించింది. ఆ సాహసికుని తెగింపు సమయస్ఫూర్తి ఎంతో ఉత్తేజం కలిగించింది. అప్పటి నుండి ఆయన మస్తిష్కంలో ముసురుకున్న అనుమానాల దొంతరలు క్రమక్రమంగా ఒక్కొక్కటి తొలగిపోసాగాయి.

ఆనాటి నుండి భవిష్యత్తు కార్యాచరణ గురించి ఆలోచిస్తున్న అష్ఫాఖుల్లాకు ఒకరోజున ఉపాధ్యాయులొకరు ప్రపంచ విప్లవవీరుల జీవిత చరిత్రల పుస్తకాన్ని ఇచ్చారు. ఆ పుస్తకంలో ప్రపంచంలోని విప్లవయోధుల జీవిత చరిత్రలు దృశ్యీకరించి ఉన్నాయి. అష్ఫాఖ్‌కు ఆ పుస్తకం ఇస్తూ **ఈ పుస్తకం బహుమతిగా తీసుకోవడానికి నీవు మాత్రమే అర్హుడవు, అందుకని నీకు ఇస్తున్నా**నని ఆయన అన్నారు. ఆ మాటలు అష్ఫాఖ్‌లో కించిత్తు గర్వాన్ని కలిగించాయి. ఆయన పుస్తకాన్ని చాలా దీక్షగా చదివారు. పుస్తకం చదువుతున్నంత కాలం పుస్తకంలోని ఒక్కొక్క వీరుడు తన ముందు నిలిచి, అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శిస్తూ, విప్లవోద్యమ సంఘటనలను పూసగుచ్చి వివరించినట్లుగా ఆయన భావించారు.

ఆ పుస్తక పఠనం సాగినాక ఆయన మస్తిష్కం పలు ప్రశ్నలకు వేదికయ్యింది. ఆ పుస్తకంలోని విప్లవ యోధుల్లాగే తనకూ మాతృదేశం కోసం జీవితాన్ని పణంగా పెట్టే సువర్ణావకాశం లభిస్తుందా? తాను కూడా విప్లవకారుడు కాగలడా? ఆ మహద్భాగ్యం తనకూ దక్కుతుందా? అని ఆయన తన్నుతాను పలుమార్లు ప్రశ్నించు కోసాగారు. ఆ ప్రశ్నలకు ఆయన స్వయంగా సమాధానం చెప్పుకుంటూ, మాతృదేశం కోసం ప్రాణాలను త్యాగం చేయగల విప్లవోద్యమ కార్యాచరణను రూపొందించుకు నేందుకు సిద్ధమయ్యారు.

## విప్లవకారుల పరిచయం

ప్రపంచ విప్లవోద్యమాలు, ఆ విప్లవోద్యమాలకు జీవితాలను అర్పితం చేసి, స్వజన హితం కోరుతూ, పరాయి పాలకుల బానిసత్వం నుండి మాతృదేశాల విముక్తి కోసం పోరాడుతున్న విప్లవకారుల సాహసోపేత జీవితాల ద్వారా స్ఫూర్తి పొందిన అష్ఫాఖ్ మాతృదేశం కోసం ప్రాణాలు అర్పించిన విప్లవకారునిగా ఆ విశ్వవిఖ్యాత విప్లవ వీరుల సరసన నిలబడాలని తీర్మానించుకున్నారు. అప్పటి నుండి విప్లవకారుల స్నేహం కోసం ప్రయత్నాలు ప్రారంభించారు. అబ్బీ రిచ్ మిషన్ హైస్కూల్ లోని సహ విద్యార్థి శ్రీ





రాజారాం పరిచయం కోసం ప్రయత్నించారు. ఆపాటికి ఆయన అరెస్టు కావడంతో అది సాధ్యం కాలేదు. శ్రీ రాజారాం అరెస్టు జరిగినప్పుడు తన మిత్రుడు అందించిన సమాచారం మేరకు, తన పాఠశాలలోని ఇతర విప్లవకారుల కోసం ఆయన అన్వేషణ ప్రారంభించారు.

ఆ ప్రయత్నంలో అష్ఫాఖ్ ఉండగా, ఒక మిత్రుడు ఆయనకు **ఆనంద్‌మఠ్** గ్రంథాన్ని ఇచ్చాడు. అది హిందీలో రాసి ఉంది. అష్ఫాఖ్‌కు హిందీ సరిగ్గా రానందువల్ల మరొక మిత్రుడి ద్వారా ఆ పుస్తకాన్ని చదివించుకుని పూర్తిగా విన్నారు. ఆ పుస్తకం చదువుతూ, ఆ పుస్తకంలోని విశేషాలను చర్చించుకుంటున్న సందర్భంగా విప్లవోద్యమంలో ప్రముఖ పాత్ర వహిస్తున్న, ఆ పాఠశాలకు చెందిన మరో విద్యార్థి శ్రీ పండిత్ రాంప్రసాద్ బిస్మిల్ గురించి ఆ మిత్రుడు చెప్పాడు. ఆ రాంప్రసాద్ బిస్మిల్ కూడా అష్ఫాఖ్ స్వగ్రామమైన షాజహాన్‌పూర్‌కు చెందినవారు. అష్ఫాఖ్ అన్నయ్య రియాతుల్లా ఖాన్‌కు బిస్మిల్ మిత్రుడు మాత్రమే కాదు, Abbie Rich Mission High School లో ఆయన సహవిద్యార్థి.

ఆ మాత్రం సమాచారం అందటంలో శ్రీ రాం ప్రసాద్ బిస్మిల్ పరిచయం కోసం అష్ఫాఖ్ ప్రయత్నాలు ప్రారంభించారు. అష్ఫాఖ్‌కు శ్రీ బిస్మిల్ పరిచయం అంత తేలిగ్గా దొరకలేదు. ఒకసారి షాజహాన్‌పూర్ పట్టణం సమీపాన గల 'ఖౌన్నౌత్' నది తీరాన గల ఇసుక తిన్నెల మీద సభ జరిగింది. అందులో రాంప్రసాద్ బిస్మిల్ పాల్గొంటున్నట్టు తెలిసి ఆయన పరిచయం కోరుతూ అష్ఫాఖ్ కూడా సభకు హాజరయ్యారు. ఆ సభలో శ్రీ బిస్మిల్ ప్రసంగిస్తూ, మాతృభూమి స్వేచ్ఛ కోసం ఎటువంటి త్యాగానికైనా తాను సిద్ధమని ప్రకటించారు. మాతృభూమికి స్వేచ్ఛ ప్రసాదించేందుకు తన లాంటి యువకులు కూడా అందుకు సిద్ధం కావాలని ఆయన కోరారు. ఆ ప్రసంగం అష్ఫాఖ్‌ను ముగ్దుడ్ని చేసింది. ఆ క్షణాన రాంప్రసాద్ బిస్మిల్ మార్గదర్శకత్వంలో విప్లవోద్యమంలో ప్రవేశించాలని అష్ఫాఖ్ నిర్ణయించుకున్నారు.

## ముస్లిం యోధులకు అగ్నిపరీక్ష

ఆ సభలో మొట్టమొదటి సారిగా శ్రీ రాంప్రసాద్ బిస్మిల్‌ను అష్ఫాఖ్ చూసారు. అప్పటి నుంచి ఆయన బిస్మిల్‌ను తరచుగా కలవసాగారు. ఆయనతో మాట్లాడేందుకు ప్రయత్నించారు. అష్ఫాఖ్ ఎన్నిసార్లు కలిసినా బిస్మిల్ ఆయనను సరిగ్గా పలకరించేవారు

కాదు. అష్ఫాఖ్ పట్ల నిర్లక్ష్యంగా వ్యవహరించారు. కనీసం మర్యాదపూర్వక పలకరింపు లేకపోగా అష్ఫాఖ్‌ను అనుమానించారు. ఆ అనుమానాలు-అవమానాలను అష్ఫాక్ ఏమాత్రం పట్టించుకోకుండా తన ప్రయత్నాలు కొనసాగించారు.

ఈ పరిస్థితి ఆనాడు కేవలం ఒక్క అష్ఫాఖ్‌కు మాత్రమే పరిమితం కాదు. మాతృదేశం కోసం ప్రాణాలు తృణప్రాయంగా భావించిన ముస్లిం విప్లవకారులలో పలువురికి ఈ చేదు అనుభవాలు తప్పలేదు. అద్వితీయ దేశాభిమానం కలిగిన వ్యక్తిగా ఖ్యాతిగాంచిన మౌలానా అబుల్ కలాం ఆజాద్‌కు కూడా ఇటువంటి దురదృష్టకర పరిస్థితి ఎదురయ్యింది. బెంగాల్‌కు చెందిన విప్లవ గ్రూపు **అనుశీలన సమితి**లో మౌలానా అబుల్ కలాం సభ్యత్వం కోరారు. మౌలానా ముస్లిం కావడం వల్ల ఆయన్ను అనుమానించి సమితిలో సభ్యత్వం ఇవ్వనిరాకరించడం జరిగింది. గత్యంతరం లేక మౌలానా స్వయంగా **దారుల్ ఇర్షాద్** అనే విప్లవ సంఘాన్ని స్థాపించారు. మాతృభూమి విముక్తి కోసం ప్రాణాలను త్యాగం చేయగలమని దారుల్ ఇర్షాద్ సభ్యుల చేత పవిత్ర గ్రంథం ఖుర్ఆన్ సాక్షిగా ఖిద్దిపూర్ స్మశానంలో ప్రమాణం చేయించారు. ఆ తరువాత కొంత కాలానికి బెంగాలు విప్లవకారులు మౌలానాను గౌరవించటమే కాకుండా, ఆయన సలహాల మేరకు విప్లవ కార్యకలాపాలను పలు ప్రాంతాలకు విస్తరింపచేశారు.

ఈ విషయాలను మౌలానా ఆజాద్ తన **ఇండియా విన్స్ ఫ్రీడం** గ్రంథంలో విస్తారంగా తెలిపారు. ఆ తరువాత మౌలానా విప్లవబాటలో కొంత దూరం ప్రయాణించి మహాత్మా గాంధీ ప్రభావంతో అహింసోద్యమాన్ని అనుసరించిన విషయం తెలిసిందే.

(‘ In fact all the revolutionary groups were then actively anti -Muslim…At first they did not fully trust me and tried to keep me outside their inner council..’,-India Wins Freedom, Moulana Abul Kalam Azad, Orient Longman, Delhi, 1998, Page. 5)

అష్ఫాఖుల్లా ఖాన్ ముస్లిం యువకుడు కనుక ఆయన నిజాయితిని, నిబద్ధతను పండిత రాంప్రసాద్ బిస్మిల్ శంకించారు. ఒక్కసారైనా అష్ఫాఖ్‌తో మాట్లాడడానికి బిస్మిల్ కనీసం ఇష్టపడలేదు. ఆయనను దళంలోకి తీసుకోలేదు. పలుమార్లు ఆయన బిస్మిల్ తిరస్కారానికి గురయ్యారు. అయినా అష్ఫాక్ మాత్రం పట్టువదల్లేదు. బిస్మిల్





పరిచయం కోసం ప్రయత్నాలు ఏమాత్రం వీడలేదు. బిస్మిల్ ద్వారా విప్లవోద్యమ ప్రవేశం కోసం ఆయన నిర్విరామంగా ప్రయత్నించసాగారు.

ఒకసారి పండిత్ రాంప్రసాద్ బిస్మిల్‌ను స్వయంగా కలసి విప్లవోద్యమం గురించి చర్చించాలని అష్ఫాఖ్ పట్టుబట్టారు. అందుకు బిస్మిల్ అంగీకరించకున్నా, అష్ఫాఖుల్లా పట్టిన పట్టు వివడలేదు. అష్ఫాఖ్ ఆన్ని రోజులుగా బిస్మిల్ చుట్టూతా తిరగటంతో, చివరకు ఆయన దిగివచ్చి అష్ఫాఖ్ అభిష్టాన్ని అంగీకరించక తప్పలేదు.

ఈ విషయాన్ని బిస్మిల్ స్వయంగా తన ఆత్మకథలో ప్రస్తావిస్తూ, **నాకు బాగా గుర్తు, చక్రవర్తి క్షమాప్రకటన అనంతరం నేను షాజహాన్‌పూర్ తిరిగి వచ్చినప్పుడు నీవు మొదట నన్ను స్కూలులో కలిసావు. నన్ను కలుసుకోవాలనే కోర్కె నీ మనస్సులో ఎంతగానో ఉండింది. మైనపురి కుట్ర గురించి నాతో కొంత మాట్లాడాలని నీవు కోరావు. స్కూలులో చదివే ఒక ముస్లిం విద్యార్థి నాతో యిలాంటి విషయాల గురించి ప్రస్తావిస్తున్నాడని శంకించి నేను నీ ప్రశ్నలకు ఎంతో ఉపేక్షతో జవాబు ఇచ్చాను. నీకప్పుడు ఎంతో ఖేదం కలిగింది. నీ హృదయంలోని భావాలు నీ ముఖకవళికల్లో స్పష్టంగా గోచరించాయి.అయితే నీవంతటితో విరమించుకోక ధృఢనిశ్చయంతో నిలిచావు. ఏదోవిధంగా వీలు చూసుకుని లక్నో కాంగ్రెసులో నాతో మాట్లాడావు,** *(బిస్మిల్ ఆత్మకథ, పేజి. 105)* అని రాశారు.

అష్ఫాఖ్ పట్టువీడకుండా బిస్మిల్ వెంటపడి ఆయనతో మాట్లాడుతూ, తనను ఎలాగైనా రహస్య దళంలోకి తీసుకోమని కోరసాగారు. విప్లవోద్యమంలో తాను పనిచేయాలని అనుకుంటున్నానని బిస్మిల్‌తో చెప్పారు. చివరకు **నేను బూటకపు మనిషిని కాను**, అంటూ అష్ఫాఖ్ తన ప్రయత్నాలను మరింత ఉధృతం చేసారు. బిస్మిల్ మిత్రుల ద్వారా కూడా సిఫారస్సు చేయించారు. చివరకు ఆష్ఫాఖ్ పట్టుదల, దృఢ దీక్షను బిస్మిల్ గౌరవించక తప్పలేదు. అష్ఫాఖ్ మాటల్లో నిజాయితీ విప్లవోద్యమం పట్ల ఆయనకున్న నిబద్ధతను పరీక్షించాక, అష్ఫాఖ్‌తో సఖ్యతకు బిస్మిల్ అంగీకరించారు.

ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, **నీ మిత్రులతో చెప్పించి నాకు నమ్మకం కలిగించ ప్రయత్నించావు. చివరకు నీవే నెగ్గావు. నీ ప్రయత్నాల వలన నా హృదయంలో నీకు చోటు దొరికింది. పైగా మీ అన్న ఉర్దూ మిడిల్ స్కూల్‌లో నా సహపాఠి, మిత్రుడేన్న సంగతి తెలిసి నాకు మరీ సంతోషమైంది**, అని తరువాత రాంప్రసాద్ బిస్మిల్ అన్నారు. (బిస్మిల్ ఆత్మకథ, పేజి. 105).

# బిస్మిల్ - అష్ఫాఖ్‌ల స్నేహం

ఉత్తర భారతదేశంలో ఆనాడు వివిధ శక్తుల, వ్యక్తుల ప్రభావం వలన హిందూ–ముస్లింల మధ్య సత్సంబంధాలు లేవు. హిందూ, మస్లింల మధ్య జరుగుతున్న వివాదాలు సామరస్య వాతావరణాన్ని చెడగొట్టాయి. ఆ సమయంలో బిస్మిల్ – అష్ఫాఖ్‌ల మధ్య ఏర్పడిన స్నేహం  చాలామందికి ఆశ్చర్యం కలిగించింది.

అష్ఫాఖ్ ఇస్లాం ధర్మానురక్తుడు. ఇస్లాం ఆదేశాలను తు.చ. తప్పక పాటించే నిష్ఠాగరిష్టుడైన ధార్మికుడు. పండిత బిస్మిల్ క్రియాశీలక అర్యసమాజీకుడు. సనాతన ధర్మపరాయణుడు.  హిందూ మతం నుండి ఇతర మతాల్లోకి వెళ్ళిన వారిని శుద్ధి కార్యక్రమం ద్వారా తిరిగి హిందూ మతంలోకి ఆహ్వానించే కార్యక్రమాలను చురుగ్గా నిర్వహిస్తున్న వ్యక్తి. మత ధర్మాలను బట్టి ఎవరికి వారు సనాతనులుగా పరిగణించబడే వ్యక్తులు వారిద్దరు. అటువంటి వ్యక్తుల మధ్య ఏర్పడిన స్నేహబంధం చాలా చర్చనీయాంశమైంది.

ఈ స్నేహబంధం ఆనాడు ఎంత సంచలనం సృష్టించిందో, ఈ యోధుల గురించి బంధుమిత్రులు ఏమనుకున్నారో బిస్మిల్ తన ఆత్మకథలో ఈ విధంగా చెప్పుకున్నారు.



అష్ఫాఖ్‌తో బిస్మిల్





**ఒక పచ్చి ఆర్యసమాజికునికి, ఒక ముస్లిముకు మధ్య యిలా స్నేహం ఎలా కలిసింది? అని అంతా ముక్కుపై వేలేసుకునేవాళ్ళు. నేను ముహమ్మదీయులను శుద్ధి (హిందువులుగా మార్చిడి) చేస్తుండేవాడిని. ఆర్యసమాజ మందిరంలోనే నా నివాసం ఉండేది. కాని నీవీ విషయాలను వేటినీ కించిత్తయినా లేక్కచేయలేదు. నీవు ముహమ్మదీయుడివి కావడం చేత నా మిత్రులు కొందరు నిన్ను తిరస్కారభావంతో చూస్తుండేవారు. కానీ నీవు ధృఢనిశ్చయంతో నిలిచావు. నన్ను కలుసుకోవడానికి నీవు ఆర్యసమాజ మందిరానికి వచ్చిపోతుండేవాడివి. హిందూ–ముస్లింల కలహాలు చెలరేగినప్పుడు మీ పేటలో అందరూ నిన్ను బాహటంగా దూషించేవారు. కానీ నీ వెప్పుడూ వాళ్ళ అభిప్రాయాలతో ఏకీభవించలేదు.** (బిస్మిల్ ఆత్మకథ, పేజి. 105–106)

ఆర్య సమాజికుడైన బిస్మిల్‌తో స్నేహం వద్దని అష్ఫాక్ మీద ఆయన కుటుంబీకులు, సన్నిహిత మిత్రులు చాలా ఒత్తిడి తెచ్చారు. అష్ఫాఖ్ మాత్రం బిస్మిల్ స్నేహాన్ని వదులుకోలేదు. ప్రతిరోజు బిస్మిల్‌తో కలిసి ఎక్కువ సమయం ఆయనతో గడుపుతూ, బ్రిటీషు ప్రభుత్వం ప్రజా వ్యతిరేక చర్యలు, ప్రజలు పడుతున్న పాట్లు, స్వేచ్ఛా–స్వాతంత్ర్యం కోసం సాగుతున్న రహస్య ఉద్యమాలు, పోరాటాల పరిణామాలు తదితర  పలు విషయాల మీద చర్చలు జరిపేవారు. స్వేచ్ఛా–స్వాతంత్ర్యాలు అను మహత్తర లక్ష్యాల  సాధనకు కంకణం కట్టుకున్న ఆ యోధులు తాము అనుసరించాల్సిన నూతన పథకాల రూపకల్పన గురించి ఆలోచనలు సాగించారు.

ఈ ఇరువురు యోధుల మధ్య మాతృదేశ విముక్తి లక్ష్యమే ప్రధాన బంధమని సన్నిహితులు, బంధువులు అర్థం చేసుకోలేకపోయారు. ఆ స్నేహ సంబంధాల స్వభావం తెలియక అష్ఫాఖ్ కుటుంబీకులు మరీ కంగారు పడ్డారు. ఆయనెక్కడ  మతం వదలి, శుద్ధి చేయించుకుని హిందువైపోతాడో అని భయపడ్డారు.  బిస్మిల్‌తో స్నేహాన్ని మానుకోవాల్సిందిగా పట్టుబట్టారు. ఒకసారి అనారోగ్యం వలన అష్ఫాఖ్ అపస్మారక స్థితిలోకి వెళ్ళారు. బంధువులు, మిత్రులు కంగారు పడసాగారు. ఆ స్థితిలో కూడా ప్రతిరోజు కలుసుకుని, ఎక్కువ కాలం గడిపే మిత్రుడు బిస్మిల్‌ను అష్ఫాక్ కలవరించ సాగాడు. ఆ కలవరింపుతో ఆయన తన కుటుంబీకులలో కలకలం సృష్టించారు.

ఈ విషయాన్ని బిస్మిల్ వివరిస్తూ, **మీ పేటలో అందరూ నిన్ను బాహాటంగానే విమర్శిస్తూ ఉండేవారు. చివరకు కాఫిర్ అనికూడా పిలుస్తుండేవాళ్లు. కాని నీవెప్పుడూ వాళ్ళ అభిప్రాయాలతో ఏకీభవించలేదు. నీకు నామీద ప్రగాఢ అభిమానం ఉండేది. అయితే నీవు నాపేరును పూర్తిగా పిలువగలిగేవాడివి కాదు. నీవెల్లప్పుడూ నన్ను రామ్**

అని సంబోధిస్తుండేవాడివి. ఒకసారి నీవు తీవ్రమైన గుండెదడ (Palpitation of heart) వచ్చి అచేతనంగా పడిపోయావు. నీ నోటి నుండి మాటిమాటికి 'రామ్..హాయ్.. రామ్' అను శబ్దాలే వెలువడ్డాయి. దానితో నీవద్ద నిలబడ్డ మీ సోదరులు, బంధుజనులంతా యిదేమిటిలా 'రామ్..రామ్' అంటున్నాడని మహాశ్చర్యపడిపోసాగారు. అరే 'అల్లా.. అల్లా...అల్లా అనరా' అని నిన్ను కోరసాగారు. కాని నీవు రామ్..రామ్ అనడం మానలేదు. ఈ రామనామ జపం రహస్యం తెలిసిన మిత్రుడొకరు అక్కడికి రావడం, తక్షణమే నన్ను పిలిపించడం జరిగింది. నన్ను కలిసిన తర్వాతే నీకు ఉపశమనం కలిగింది. ఇక అప్పుడందరికీ ఈ రామనామ జపం లోగుట్టు ఏమిటో అర్థమైపోయింది!., అన్నారు. (బిస్మిల్ ఆత్మకథ : పేజి.106).

బిస్మిల్ ఎన్నడూ కూడా తన మతపరమైన భావాల ద్వారా అష్ఫాఖుల్లాను ప్రభావితం చేయలేదు. ఈ విషయంలో ఆయన చాలా స్పష్టంగా ఉన్నారు. అష్ఫాఖ్ కుటుంబీకులు ఆయనెక్కడ బిస్మిల్ ద్వారా శుద్ధి చేయబడతాడోనని భయపడసాగారు. ఆ విషయం తెలుసుకున్న ఆయన, నీ ప్రవర్తన చూసి మీ వాళ్ళంతా, 'నీవెక్కడ మన మతం వదిలి, శుద్ధి చేయించుకుని హిందువై పోతాడో' నని ఆందోళన చెందుతూండేవాళ్ళు. కానీ, నీ హృదయం ఏ విధంగానూ అశుద్ధంగా వుండలేదే, మరి నీవింకే వస్తువును శుద్ధి చేయిస్తావనుకున్నారు. ఈ విధంగా నీవు సాధించిన ప్రగతి నా హృదయాన్ని పూర్తిగా గెలుచుకున్నది. (బిస్మిల్ ఆత్మకథః పేజి 106) అని అష్ఫాఖ్ మత మనోభావాల పట్ల బిస్మిల్ గౌరవం వ్యక్తంచేశారు.

బిస్మిల్ ఎక్కడుంటే అష్ఫాఖుల్లా ఖాన్ అక్కడుండేవారు. ఈ యువకులు ఆదర్శప్రాయమైన స్నేహబంధాన్ని ప్రదర్శించారు. ఒక మహత్తర లక్ష్యాన్ని సాధించేందుకు ఏర్పడిన బంధం జాతి, మత, కుల ప్రాంతాలకు అతీతంగా ఉంటుందని రుజువు చేసారు. దేశాన్ని వలస పాలకుల నుండి విముక్తం చేసేందుకు ప్రారంభమైన సాయుధ పోరాటం మతం, మతధర్మాల బంధనాలను కూడా ఛేదించిందనడానికి ఈ ఇరువురు విప్లవకారుల ప్రవర్తన, స్నేహం ప్రబల రుజువుగా చరిత్రలో స్థిరపడింది.

ఈ ఇరువురిని మిత్రులు, బంధువులు మతభ్రష్టులుగా నిందించారు. బిస్మిల్‌ను ఆయన స్నేహితులు హెచ్చరిస్తూ చేసిన వ్యాఖ్యలను ప్రస్తావిస్తూ, 'మా బృందంలో తరచూ నీ గురించి (అష్ఫాఖుల్లా ఖాన్ గురించి) చర్చ వచ్చేది. ఏమో నమ్ముతున్నావు.. మోసపోయేవు సుమా అని అనేవాళ్ళు.. కానీ నీవు నెగ్గావు' (బిస్మిల్ ఆత్మకథః పేజి.





106) అని స్వయంగా బిస్మిల్ చెప్పుకున్నారు. ఆ మిత్రుల సన్నిహితులు, కుటుంబీకులు ఎటువంటి విమర్శలు చేసినా, ఈ మిత్రులిరువురి మధ్య చివరి వరకు చక్కని స్నేహబంధం వర్థిల్లింది. ఈ విషయాన్ని బిస్మిల్ పేర్కొంటూ, **నేను నీవు అనే తేడా లేకుండా పోయింది మన మధ్య, తరచూ నీవూ నేను ఒకే కంచంలో తిన్నాము,** అని ఆత్మకథలో (పేజి. 106) రాసుకున్నారు.

బిస్మిల్ హృదయంలో ముస్లింల పట్ల ఏర్పడిన అపోహలను అష్ఫాఖ్ తన చక్కని ప్రవర్తనతో తుడిచేయగలిగారు. మాతృభూమి విముక్తికి సంబంధించిన అంశం ప్రధానమైనపుడు హిందువైనా, ముస్లిమైనా ఒకే రకంగా స్పందిస్తారని, ఒకే రకంగా త్యాగాలకు సిద్ధపడతారని, ఈ సంసిద్ధతకు త్యాగాలకు మతం ఏమాత్రం అడ్డంకి కాదని కానేరదని అష్ఫాఖ్ తన అచంచలమైన దీక్షతో, నిబద్ధతతో సాక్ష్యం పలికారు. **చివరకు హిందువులు ముస్లింలలో ఏదో తేడా ఉందనే ఆలోచనే నా హృదయం నుండి నిష్క్రమించ సాగింది. నీవు నా మీద ప్రగాఢ విశ్వాసం, అమిత ప్రీతి కలిగి ఉండేవాడివి,** (ఆత్మ కథః పేజి 106) అని సనాతన సంప్రదాయానురక్తుడు, ఆర్యసమాజికుడు పండిత రాంప్రసాద్ బిస్మిల్ స్వయంగా అష్ఫాఖుల్లా ఖాన్ గురించి చెప్పుకోవాల్సి వచ్చింది.

## మాతృభూమి సేవకు జీవితం అంకితం

మాతృదేశ సేవలో తన జీవితం గడపాలని స్థిర నిర్ణయానికి వచ్చిన అష్ఫాఖుల్లా తన కుటుంబంలోని అన్నదమ్ముల్లా, ఉన్నత విద్యాభ్యాసం చేయడానికి అన్ని రకాల అవకాశాలున్నా చదువును మాత్రం కొనసాగించలేదు. చిన్ననాటనే దేశాభిమానం పుణికిపుచ్చుకున్న ఆయన ఏడవ తరగతిలోనే, విప్లవ భావాల పట్ల ఆకర్షితులయ్యారు. ఎనిమిదవ తరగతి వరకు మాత్రమే ఆయన చదువు సాగింది. ఆ తరువాత సహాయనిరాకరణ ఉద్యమం దిశగా ఆకర్షించబడ్డారు. ఆ ఉద్యమంలో పాఠశాల విద్యార్థిగానే ప్రవేశించారు.

ఆనాడు అష్ఫాఖ్ కుటుంబానికి ఉన్న పేరు ప్రతిష్ఠల కారణంగా ఉన్నతాధికారులైన కుటుంబ సభ్యుల సహాయంతో మంచి ఉద్యోగం సంపాదించుకునే అవకాశం ఉన్నా, ప్రభుత్వ ఉద్యోగం చేయడానికి అష్ఫాఖ్ ఇష్టపడలేదు. మాతృభూమి సేవలో గడపాలన్న తన జీవితాశయానికి ప్రభుత్వ ఉద్యోగాలు అడ్డుగా నిలుస్తాయని ఆయన భావించారు.



అష్ఫాఖుల్లాఖాన్

ఆ కారణంగా స్వయంగా తన జీవికను సంపాదించుకుంటూ, స్వేచ్ఛగా లక్ష్య సాధన దిశగా ముందుకు సాగేందుకు వీలున్న మార్గాల కోసం ఆయన ప్రయత్నించారు.

ఈ విషయాలను తన స్నేహితులు, కోకోరి రైలు దోపిడి సంఘటనలో సహచరుడైన శ్రీ బన్వారిలాల్‌కు రాసిన ఒక లేఖలో స్పష్టం చేసారు. ఆ లేఖలో, **ఉద్యోగంలో చేరడం అంటే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హత్య చేయడమే. నేను స్వతంత్రంగా జీవనం సాగించాలనుకుంటున్న సంగతి నీకు తెలుసు. నేను ఉద్యోగంలో చేరి నా ముసలి తల్లి బాగోగులు చూసుకుంటే బాగుంటుందని నా బంధువులు ఆశిస్తున్నారు. అది కూడా కొంతవరకు సబబే. మా ధర్మం కూడా అదే బోధిస్తుంది. అయితే మాతృభూమికి సేవలందించే మహత్తర అవకాశం లభించదు. నేను భోపాల్‌లో ఈ దినమే ఉద్యోగంలో చేరాలనుకున్నా చేరగలను. అస్రార్ హసన్ ఖాన్ గారు నాకు ఏదో ఒక మంచి ఉద్యోగం ఇప్పించగలరు. మా అన్నగారు ఆయనను కలుసుకోమని సిఫార్సు లేఖ ఇచ్చారు. ఆయన సిఫార్సు వలన నాకు సైన్యంలో సుబేదార్ ఉద్యోగం కూడా తేలిగ్గా లభిస్తుంది. ఉద్యోగంలో చేరితే నా ఆశలు, ఆశయాలన్నీ కల్లలైపోతాయి. మాతృభూమికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సాధించేందుకు మాత్రమే నేను జీవించాలనుకుంటున్నాను తప్ప, బాగా డబ్బు సంపాదించి విలాసవంతంగా పదికాలాల పాటు సుఖజీవితం గడపాలని కోరుకోవడం లేదు. భయంకరమైన ప్రమాదాలను ఎదుర్కోడానికి నేను భయపడను. బాధపడను. ప్రపంచమంతా నన్ను అమాయకుడు, పిచ్చివాడన్నా నాకు ఏ చింతా లేదు. నేను అందుకోసమే** (మాతృభూమి స్వేచ్ఛ కోసం–స్వాతంత్ర్యం కోసం) **జీవిస్తాను. మరణిస్తాను,** అని రాసారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.94-95)





అష్ఫాఖ్ వ్యవసాయాన్ని బాగా ఇష్టపడ్డారు. రైతుగా స్థిరపడితే స్వతంత్రంగా తమ రహస్య కార్యకలాపాలను సాగిస్తూ, స్వతంత్ర భావాలను, స్వేచ్ఛాయుత ఆలోచనలను, ఆశయాలను ప్రజలలో ప్రచారం చేయవచ్చని భావించారు. ప్రజలను మోసం–దగా చేయకుండా కష్టించి పని చేసి సంపాదన సమకూర్చుకునేందుకు అనువైన రంగం వ్యవసాయరంగమని ఆయన అనుకున్నారు.

ఈ మేరకు మిత్రుడు బన్వారిలాల్‌కు రాసిన లేఖలో, **నేను భూమికి యజమానినని నీకు తెలుసు. మా అమ్మగారు జమిందారిణి. నేను ఎంత భూమి కోరుకున్నా అంతా నాకు లభిస్తుంది. నా వద్ద అవసరమైన ధనం లేదు. నీకు ఆసక్తి ఉన్నట్టయితే వ్యవసాయం మీద పెట్టుబడి పెట్టు. నీవు నేనూ కలిసి అక్కడికి** (వ్యవసాయం చేయడానికి తమ భూములున్న గ్రామానికి) **వెడదాం. మనం మన రైతు సోదరుల మధ్య గడుపుతూ మన ఆలోచనలకు కార్యరూపం ఇద్దాం. ఈ రకంగా చేస్తే కొద్ది సంవత్సరాలలో మన వద్ద అవసరమైనంత ధనం సమకూరుతుంది. అప్పుడు మన ఆశయాలకు, ఆలోచనలకు భారీ స్థాయిలో ప్రచారం కల్పించవచ్చు. మన మిత్రులను కూడా ఇక్కడకు ఆహ్వానించవచ్చు. ప్రపంచంలో పవిత్రమైన లాభదాయక వృత్తి ఏదైనా ఉందంటే అది వ్యవసాయం మాత్రమే. నీవు నీ కుటుంబం కోసం ఏదో ఒకటి చేయాలి కదా... వ్యవసాయం ఎందుకు ప్రారంబించరాదు? పెట్టుబడి నీది, భూమి నాది, శ్రమ మనిద్దరిది, ప్రాపంచిక అవసరాలను తీర్చుకోడానికి మనమిద్దరం సోదరులుగా కలసి పని చేస్తూ, యువకులు అనుకుంటే సాధించలేనిది ఏమీ ఉండదని రుజువు చేద్దాం..నా సంబంధీకులు నన్ను ఎలాగైనా ఉద్యోగ బానిసత్వంలోకి నెట్టివేయాలని శతవిధాల ప్రయత్నిస్తున్నారు. వ్యవసాయం మహత్తు వీళ్ళకు తెలియదు. భారతదేశ విముక్తి వ్యవసాయం మీద ఆధారపడి ఉందని మనవాళ్ళకు తెలియదు,** అని ఆయన తన మనోగతాన్ని స్పష్టం చేశారు. ఈ మేరకు సమాజం అనుమతించిన, గౌరవ ప్రదమైన పని ద్వారా మాత్రమే మన ప్రాపంచిక అవసరాలకు సరిపడ సంపాదన సమకూర్చు కోవాలని అష్ఫాఖుల్లా ఖాన్ సంకల్పించినట్టు తెలుస్తుంది. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page. 94-95).

## దళ సభ్యత్వ స్వీకారం

విప్లవోద్యమంలో భాగస్వామి అయ్యేందుకు నిరంతరం ప్రయత్నిస్తున్న అష్ఫాఖ్ పట్టుదలను బిస్మిల్ విస్మరించలేక పోయారు. విప్లవ దళం సభ్యత్వం కోసం వెంటపడి

వేధిస్తున్న ఆయనను చివరకు **హిదూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్**లో చేర్చుకోక తప్పలేదు. ఆరంభంలో సహాయనిరాకరణోద్యమంతో బ్రిటీష్ వ్యతిరేక ఉద్యమాలలో భాగస్వామ్యానికి శ్రీకారం చుట్టిన అష్ఫాఖుల్లా ఖాన్ హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్‌లో చేరటంతో సాయుధ పోరాట యోధుడిగా పరిణామం చెందారు.

మాతృదేశ సేవకోసం విప్లవోద్యమంలో భాగస్వామి కావాలని, కలలు కంటున్న అష్ఫాఖ్‌కు ఆ కలలను పండించుకునే మార్గం లభించేసరికి సంతోషం ఉప్పొంగింది. **నేను స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కోరుకునేవాడిని. స్వాతంత్ర్యం కోసం ప్రాణాలను తృణప్రాయంగా భావించి అర్పించడానికి సర్వదా సిద్ధం. బానిసత్వపు వరమాల, అది ఎలాంటిదైనా దానిని ధరించడానికి నేను ఇష్టపడను** అని ప్రకటించుకున్న అష్ఫాఖ్ బిస్మిల్ వెంట విప్లవోద్యమంలోకి ప్రవేశించారు.

బిస్మిల్ తొలుత ఎంతగా అష్ఫాఖుల్లాను నిరాకరించారో, చివరకు విప్లవోద్యమం పట్ల అష్ఫాఖ్‌కు ఉన్న నిబద్ధత, ఆయనలోని త్యాగశీలత, కార్యాచరణను గమనించి అంతగా ఆనందించారు. అష్ఫాక్ నడతను, నిజాయితీని, నిక్కచ్చి విప్లవ భావాలను ప్రస్తావిస్తూ, **నా ఆలోచనల రంగు నీకూ అంటుకుంది. నీవు కూడా రాటుదేలిన విప్లవ కారుడవై పోయావు. ఇక అప్పటి నుండి అహోరాత్రులు నీదొక్కటే ధ్యాస...ఒకే ప్రయత్నం ఎలాగైనా సరే ముస్లిం నవయువకుల్లో కూడా విప్లవ భావాలు చొప్పించాలని, వారు కూడా విప్లవోద్యమానికి దోహదపడేట్లు చూడాలని, నీ బంధుమిత్రులు ఎంత మంది ఉన్నారో వారందరి మీద నీ ఆలోచన ప్రభావం వేయడానికి ప్రయత్నించావు...ఒక ముస్లింను విప్లవ పార్టీలో పేరెన్నిక గన్న సభ్యునిగా నేనెట్లా మార్చగలిగానా ఆని యితర సహచరులంతా కూడా తరుచూ విస్తుపోతూండే వాళ్ళు..నీదెంతో విశాల హృదయం..నీ భావాలు అత్యంత సమున్నతమైనవి**, అని బిస్మిల్ తన ఆత్మకథలో పేర్కొన్నారు. (పేజి.107)

విప్లవదళ సభ్యుడిగా ఎంతటి క్లిష్టతరమైన బాధ్యతలను అప్పగించినా అష్ఫాఖుల్లా ఖాన్ ఎన్నడూ ఎదురాడలేదు. నిర్వహణలో విఫలం కాలేదు. వ్యక్తిగత అభిప్రాయాలు ఎలా ఉన్నా, సంఘం ఉమ్మడి నిర్ణయాలను గౌరవించేవారు. విధులను క్రమశిక్షణ గల సైనికునిగా ఆచరణలో పెట్టడం ద్వారా ఆయన బిస్మిల్‌కు మంచి సన్నిహితులయ్యారు. ఈ విషయాన్ని బిస్మిల్ ప్రస్తావిస్తూ, **నీవు నా పట్ల చూపిన నడత ఎంతో ప్రశంసనీయమైనది. నీవెన్నడూ నా అజ్ఞను జవదాటలేదు. ఒక విధేయుడైన కార్యకర్తలా**





**నీవెప్పుడూ నా ఆజ్ఞాపాలన చేసావు. నీవెంతో విశాలహృదయం కలిగినవాడివి. నీ భావాలు సమున్నత మైనవి,** అని ప్రశంసించారు.(బిస్మిల్ ఆత్మకథ : 107)

విప్లవోద్యమం పట్ల దృఢసంకల్పం గల బలశాలి అష్ఫాఖ్‌ను దళ సభ్యునిగా స్వీకరించినందుకు ఆ తరువాత బిస్మిల్ ఎంతో గర్వించారు. ఆయనను మహావీరునిగా పరిగణించారు. ఈ విషయాన్ని చాలా గర్వంగా ప్రకటించారు. **నాకిప్పుడు కొంతైనా తృప్తిగా వున్నదంటే, ఈ ప్రపంచంలో నా పేరు ప్రతిష్టల్ని నీవు సముజ్వలం గావించావనే. 'అష్ఫాఖుల్లా విప్లవోద్యమంలో పాల్గొన్నాడు. తోబుట్టువు, బంధు మిత్రులు ఎంతగా వారించినా ఆతడు ఏమాత్రం లెక్కచేయలేదు. అరెస్టయిన పిదప కూడా తన భావాలను వదలుకోకుండా సుదృఢంగా నిలిచాడు' అనే ఈ సంగతి భారత దేశ చరిత్రలో ఎంతో ఉల్లేఖనీయమైనది. శారీరకంగా నీవెలా బలశాలివో, మానసికంగా సైతం అలాగే మహా వీరునిగా నిలిచావు. నీ ఆత్మ మహోన్నతమైనదిని నిరూపించుకున్నావు,** (బిస్మిల్ ఆత్మకథ: పేజీ.108) ఆని బిస్మిల్ సంతోషం వ్యక్తం చేశారు.

అష్ఫాఖుల్లా విప్లవోద్యమంలో తన్నుతాను అంకితం చేసుకొవడంతో ఆగలేదు. విప్లవోద్యమ ఛాయలు తన బంధు-మిత్రుల మీద కూడా ప్రసరింపచేయాలని ప్రయత్నించారు. విప్లవకారునిగా తన లక్ష్యాలను సన్నిహితులకు ఎరుకపర్చుతూ వారిని కూడా మాతృభూమి సేవలో పునీతులయ్యేందుకు ప్రోత్సహించారు. ఈ విషయాన్ని బిస్మిల్ ప్రస్తావిస్తూ, **నీ బంధుమిత్రులెంత మంది వున్నారో వారందరి పైన నీ అలోచనలు పడవేయడానికి ప్రయత్నించావు,** (పేజి.107) అని అష్ఫాఖ్ ప్రయత్నాలను ప్రశంసించాడు. **చివరకు ఈ కార్యక్రమాల ఫలితంగా, కోర్టులో నిన్ను నా లెఫ్టినెంటువని పేర్కొన్నారు. ఇక తీర్పు రాసిన న్యాయమూర్తి కూడా నీ మెడలో జయమాల (ఉరిత్రాడు) వేశాడు,** అని ఆత్మకథలో బిస్మిల్ పేర్నొన్నాడు. (బిస్మిల్ ఆత్మ కథ : పేజి.108).

## అనుచరుడు కాదు సహచరుడు

విప్లవోద్యమంలో ఒకరికి అనుచరునిగా ఉండడానికి అష్ఫాఖుల్లా ఖాన్ ఏమాత్రం ఇష్టపడలేదు. విప్లవ దళంలోని సభ్యులకు, చివరికి నాయకుడికి కూడా సహచరుడిగా మాత్రమే ఆయన మెలిగారు. మిత్రులతో సిఫార్సు చేయించుకుని, అతి కష్టం మీద రహస్య దళంలో స్థానం పొందినా, బిస్మిల్‌ను ఆయన ఎంతగా గౌరవించినప్పటికీ

ఆయన సహచరుడిగా మాత్రమే మెలిగారు తప్ప **బిస్మిల్ అనుచరుడు** అనిపించుకోడాన్ని ఇష్టపడలేదు. ఆత్మగౌరవాన్ని కాపాడుకుంటూ, ఆత్మాభిమానానికి ఎటువంటి విఘాతం కలుగన్వికుండా, నికార్సయిన విప్లవకారునిగా అష్ఫాఖ్ విప్లవోద్యమంలో ఎదిగారు.

విప్లవకారుల సమావేశాలలో ఇతర మిత్రుల అభిప్రాయాలతో సంబంధం లేకుండా, తన అభిప్రాయాన్ని, స్పష్టంగా సూటిగా ప్రకటించడం ఆయన అలవాటు. సహచర విప్లవకారులు ఎంతగా వ్యతిరేకించినా ఆయన మాత్రం తన అభిప్రాయాన్ని నిక్కచ్చిగా వెల్లడించేవారు. ఒకసారి సమావేశం నిర్ణయాలు తీసుకున్నాక, ఆ ఉమ్మడి నిర్ణయాలను గౌరవించడం, ఆ నిర్ణయాన్ని ఆచరించడంలో ఎంత ప్రమాదం ఉన్నా ఏ మాత్రం ఖాతరు చేయక ముందుకు సాగటం అష్ఫాఖ్ లోని ధైర్యసాహసాలకు, ఉత్తమ ప్రజాస్వామిక లక్షణాలకు ప్రతీక.

అష్ఫాఖుల్లా ఖాన్ స్వభావాన్ని, ప్రవర్తనను, ఆత్మాభిమానాన్ని బిస్మిల్ తన ఆత్మకథలో ఉటంకిస్తూ, **నీవు నాకు తమ్ముడి తీరుగా అయినావు. కాని తమ్మునిలా చూసుకున్నా నీకు తృప్తి కలుగలేదు. సరిసమానుడిగా చూడాలని, సమాన స్థాయిలో నా మిత్రుడునిగా లెక్కించబడాలని నీవు కోరుకునేవాడివి. చివరకు అదే అయ్యింది. నీవు నాకు నిజమైన స్నేహితుడివైనావు. ఒక్క పచ్చి ఆర్యసమాజికుడికి ఒక ముహమ్మదీయునికి మధ్య స్నేహం ఎలా కలిసింది. అని అంతా ముక్కుపై వేలేసుకునేవాళ్ళు,** (బిస్మిల్ ఆత్మకథ : పేజి. 105) అని స్వయంగా రాసుకున్నారు.

ఈ విప్లవ వీరుల మధ్య అంతటి గాఢమైన సంబంధాలు ఉండడం వలన కాకోరి రైలు సంఘటన కేసులో ఉరిశిక్ష పడ్డాక, జైలు నుంచి 1927 చివరి మాసాల్లో బిస్మిల్ రాసిన ఆత్మకథలో అష్ఫాఖుల్లా ఖాన్ మీద ప్రత్యేకంగా ఒక అధ్యాయం కేటాయించారు. ఆ అధ్యాయాన్ని, **నేనీ కేసులో భాగస్వామినై వహించిన పాత్ర నిర్వహణాక్రమంలో ఎవరెవరి జీవితాల భాధ్యత నా భుజస్కంధాలపై వుండిందో– వాటిలో అధిక భాగం శ్రీ అష్ఫాఖుల్లా ఖాన్‌వారసీకి సంబంధించి వుంది. కనుక ఈ అంతిమవేళ ఆయన గురించి కూడా ఈ చేత్తో నాలుగు మాటలు రాయడం నా కర్తవ్యమని భావిస్తున్నాను,** (పేజి.105) అని ప్రారంభించారు.

ఈ విధంగా బిస్మిల్ వ్యక్తం చేసిన విషయాల ద్వారా విప్లవోద్యమంలో అష్ఫాఖుల్లా ఖాన్ నిర్వహించిన పాత్ర ఎంతటి ప్రాధాన్యత గలదో అవగతం కాగలదు.





# ప్రగతిశీల భావాల దార్శనికుడు

భారతదేశాన్ని బ్రిటీష్ వలసపాలకుల నుండి విముక్తం చేశాక స్వతంత్ర భారత దేశం ఏవిధంగా ఉండాలన్న విషయంలో అష్ఫాఖుల్లా ఖాన్ చాల స్పష్టమైన అభిప్రాయాలను కలిగి ఉన్నారు. స్వతంత్ర భారతంలో ఎటువంటి అసమానతలకు చోటు ఉండరాదని ఆయన ఆకాంక్షించారు. కాని ఆయన తన భావాలకు స్పష్టమైన సైద్ధాంతిక స్వరూపాన్ని కల్పించలేకపోయారు. కాకోరి విప్లవకారుల తరువాత ఆ భావాలకు సర్దార్ భగత్‌సింగ్ స్పష్టమైన సైద్ధాంతిక రూపం కల్పించారు. భగత్‌సింగ్ కంటే నాలుగు సంవత్సరాల ముందు విప్లవోద్యమంలో ప్రాణాలర్పించిన అష్ఫాఖుల్లా ఖాన్ ఆర్థిక అసమానతలు, సాంఘీక అంతరాలు, ఏ రకమైన దోపిడీ లేని సమసమాజ వ్యవస్థను ఆశించారు. ఆశించటమే కాదు ఆయన ఆకాంక్షల భారత దేశం ఎలా ఉండాలో ఆ విషయాలను కూడా ఆయన వివరించారు. ఈ మేరకు ఆయన మిత్రులకు, సన్నిహితులకు రాసిన లేఖలలో ఆ ఆలోచనలు చాలా స్పష్టంగా దర్శనమిస్తాయి.

అష్ఫాఖుల్లా ప్రగతిశీల ఆలోచనల విషయాన్ని ప్రస్తావిస్తూ, **ఈ విషయంలో ఆయన కాకోరి విప్లవ కాలం నాటి తన సహచర విప్లవ యోధుల కంటే అష్ఫాఖ్ ముందున్నారు. ఆయన మహోన్నత భావాలను కలిగి ఉన్నారు. ఆయన స్వదేశీ, సద్భావనా, సామ్యవాద లక్ష్యాల సాధన కోసం ప్రజలను చైతన్యవంతులను చేయాలన్నారు. అన్ని రకాల అంతరాలు, దోపిడి అంతం కావాలని,** అష్ఫాఖ్ ఆకాంక్షించారని ప్రముఖ చరిత్రకారుడు శ్రీ సుధీర్ విద్యార్థి అభిప్రాయపడ్డారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.10)

అష్ఫాఖ్ తనలోని సామ్యవాద, సమసమాజ భావనలను స్పష్టీకరించే పడికట్టు పదాలను మాత్రం ఉపయోగించలేదు. ఆయన తన భావాలను సాదాసీదాగా తనదైన భాషలో వ్యక్తీకరించారు, దృశ్యీకరించారు. ఆ కాలంలో అష్ఫాఖుల్లాఖాన్ ప్రగతిశీల భావాలను వ్యక్తం చేయడం పట్ల శ్రీ సుధీర్ విద్యార్థి ఆశ్చర్యం వ్యక్తం చేసారు. ఈ కోణం నుండి విశ్లేషిస్తే, సామ్యవాద భావనలను వ్యక్తం చేయడంలో అష్ఫాఖుల్లా ఖాన్ సర్దార్ భగత్‌సింగ్ కంటే ముందున్నారని ఆయన ప్రకటించారు. అఫ్ఫాఖ్‌లో ముడిసరుకుగా పొటమరించిన సమసమాజ భావాలను కాకోరి విప్లవకారుల తరువాత రంగం మీదకు వచ్చిన ప్రముఖ విప్లవకారుడు సర్దార్ భగత్ సింగ్ లాంటి యోధులు చక్కని సైద్ధాంతిక రూపాన్ని కల్పించారని శ్రీ సుధీర్ విద్యార్థి తన Shaheed Asfaqulla Khan Aur Unka Yug : Page.10) గ్రంథంలో పేర్కొన్నారు.

**అష్ఫాఖ్ అన్ని రకాల దోపిడిని వ్యతిరేకించారు. అన్ని రకాల దోపిడి నుండి ప్రజలు విముక్తం కావాలని ఆయన ఆశించారు. అటువంటి ఇండియాను ఆయన కాంక్షించారు. రైతులు, కార్మికులు ఎటువంటి దోపిడికి గురికారాదు. అన్ని రకాల దోపిడీల నుండి ప్రజలకు స్వేచ్ఛ ఉండాలి,** అని ఆయన తన స్వప్నాన్ని వ్యక్తం చేశారు.

(Where there would be no exploitation of Farmers and labourers. Where would be freedom from all types of exploitations - Great Revolutionary Martyr Ashfaqullah Khan, Dr.Omkar Nath Tripathi, Basha Sangam, Allahabad, 2001, Page.7)

ఆర్థిక అసమానతలే కాదు, సామాజిక అంతరాలు కూడా కానరాని స్వతంత్ర భారతదేశాన్ని అష్ఫాఖ్ కోరుకున్నారు. ఈ మేరకు ఓ లేఖ రాస్తూ, **నా దేశంలోని పేద ప్రజానీకమంతా సుఖశాంతులతో సమానంగా జీవించగల స్వతంత్ర భారతదేశాన్ని నేను ఆకాంక్షిస్తున్నాను,** అని అన్నారు. సామాజిక అంతరాల నుండి స్వేచ్ఛకు సంబంధించి ఆయన తన కలల దృశ్యాన్ని జైలు నుండి మిత్రులకు రాసిన పలు లేఖలలో వర్ణించారు. ఆ రోజులలో కులం-మతం, ఆర్థిక స్థాయిని బట్టి ప్రజల మధ్య అంతరాలు ఉండటం వలన, అష్ఫాఖుల్లాలోని సృజనశీలుడు తాను కలలు గంటున్న సామాజిక వ్యవస్థను ఈ విధంగా చిత్రించారు.

**నా తరువాత వీలయినంత త్వరగా వర్క్‌షాపులో పని చేసే మేస్త్రీ అబ్దుల్లా, ఘనీ, రైతులు కలసి శ్రీ ఖలిఖుజ్జామాన్** (ప్రముఖ రాజకీయ నాయకుడు - సంపన్న జమీందారు)**, శ్రీ జగన్నాథ్ నారాయణ ముల్లా** (ప్రముఖ న్యాయవాది, లిబరల్ పార్టీ నాయకుడు)**, ముహమ్మదాబాద్ రాజా సాహెబ్** (ముహమ్మదాబాద్ జమీందారు)**లతో కలిసి లక్నోలోని ఛత్తర్ మంజిల్** (ప్రసిద్ధ కట్టడం)**లోని కుర్చీలలో ఆశీనులై కన్పించేలా చూడాలని ఆ దేవుడ్ని కోరుకుంటున్నానని,** అష్ఫాఖుల్లా ఖాన్ ప్రకటించారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, Page.10)

ఆయన చిత్రించిన విధంగా సామాజిక వ్యవస్థ రూపొందాలని భగవంతుడ్ని వేడుకున్నారు. ఆయన తన ఆకాంక్షలను, ఉరిశిక్ష అమలుకు ఎదురుచూస్తూ, జైలు గోడల మధ్య గడుపుతున్న సమయంలో రాశారు. ఆ కారణంగా తాను ఉన్నా లేకపోయినా అంతరాలు లేని సామాజిక వ్యవస్థను సృష్టించాల్సిందిగా కోరారు. ఈ మేరకు తన కోర్కెను వెల్లడించటంలో అష్ఫాఖ్‌కు, సర్దార్ భగత్‌సింగ్‌కు వ్యత్యాసం కనిపిస్తుంది. నూతన వ్యవస్థల నిర్మాణానికి ప్రజలు నడుంకట్టాలని భగత్‌సింగ్ సైద్ధాంతీకరించగా,





అష్ఫాఖుల్లా ఆ భారాన్ని **భగవంతుడి** మీద మోపారు. ఈ కారణంగా భగత్ సింగ్‌కు స్ఫూర్తినిచ్చిన అష్ఫాఖుల్లా ఖాన్‌ను కొన్ని వర్గాలు విస్మరించాయి.

సుమారు 80 సంవత్సరాల క్రితం ఓ గ్రామీణ ప్రాంతంలో, ఒక నిమ్న కులానికి చెందిన ఘనీ, సామాన్య కార్మికుడు అబ్దుల్లా, ఓ చిన్నపాటి రైతు కలసి ఆనాటి సమాజంలో పేరెన్నికగన్న నాయకులు, సంపన్నుల సరసన కూర్చోని ఉన్న దృశ్యాన్ని తాను కళ్ళారా చూడాలని అష్ఫాఖ్ ఆశపడ్డారు. ఈ మేరకు సామాజిక-ఆర్థిక అసమానతలు లేని సమసమాజాన్ని అష్ఫాఖ్ ఆనాడు కాంక్షించటం ఆయనలోని ప్రబలమైన ఆకాంక్షకు నిదర్శనం.

## అసమాతల స్వాతంత్ర్యం అక్కరలేదు

అష్ఫాఖుల్లా ఖాన్ జమీందారి వ్యవస్థ పట్ల కూడా వ్యతిరేకత వ్యక్తం చేసారు. జమీందారి వ్యవస్థ రైతు శ్రమ పలితాన్ని దోచుకుంటుందని విమర్శించారు. జమీందారి కుటుంబీకుడైన ఆయన జమీందారి వ్యవస్థకు వ్యతిరేకంగా మాట్లాడడం, రైతు పక్షం వహించడం, రైతుల కష్టార్జితాన్ని జమీందారులు జలగలు రక్తం పీల్చినట్టు పీల్చుకుంటున్నారని వ్యాఖ్యానించడం గమనించాల్సిన అంశం. ఆయన తన స్నేహితునితో **భూమి నాది, పెట్టుబడి నీది, శ్రమ మనిద్దరిది, ఫలితం మనది - మనందరిది** అనడం ఆయనలోని ప్రగతిశీల భావాలకు అద్దం పడుతుంది.

ఒకవేళ ఇండియాకు సమసమాజం సాధ్యం కాని స్వాతంత్ర్యం లభించినట్లయితే అటువంటి స్వరాజ్యం అక్కరలేదని అష్ఫాఖ్ స్పష్టంగా ప్రకటించారు. **భారతదేశం స్వాతంత్ర్యం పొంది తెల్లపాలకుల నుండి మన స్వదేశీ సోదరుల చేతుల్లోకి అధికార పగ్గాలు వచ్చిన తరువాత కూడా పేద ధనిక, జమీందార్ రైతు సంబంధాలు యధావిధిగా ఉన్నట్టయితే అటువంటి స్వతంత్ర భారతదేశాన్ని నేను కోరుకోనని** అన్నారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, Page.10). అన్ని రకాల వివక్షతల నుండి ప్రజలకు సమానత్వం ప్రసాదించలేని స్వతంత్రం అక్కరలేదని స్పష్టం చేయడం ద్వారా ఎటువంటి అసమానతలు లేని సమసమాజాన్ని అష్ఫాఖ్ ఎంత బలంగా కోరుకున్నారో తెలుస్తుంది.

ఈ తరహాలోనే మౌలానా అబుల్ కలాం అజాద్ కూడా హిందూ-ముస్లింల మధ్య ఐక్యత లేని స్వరాజ్యం వలదన్నారు. ఈ విషయమై మౌలానా మాట్లాడుతూ,

స్వర్గం నుండి దేవదూతలు దిగివచ్చి హిందూ–ముస్లింల ఐక్యతను వదులుకుంటే ఇరవైనాలుగు గంటల్లో దేశానికి స్వరాజ్యం లభిస్తుందని కుతుబ్‌మినార్ నుండి ప్రకటిస్తే, ఆ స్వరాజ్యాన్ని నేను నిరాకరిస్తాను. అలా కాదు మిత్రమా, హిందూ–ముస్లింల ఐక్యత కోసం నేను స్వరాజ్యం డిమాండ్‌ను వదులుకుంటాను. స్వరాజ్య సిద్ధి ఆలస్యమైతే భారత దేశం మాత్రమే నష్టపోతుంది. హిందూ–ముస్లింల ఐక్యతకు భంగం వాటిల్లితే మానవ జాతికి నష్టపోగలదని ఆయన ఆందోళన వ్యక్తం చేశారు.

(' If an angel descends from heaven today and proclaims from the Qutub Minar that India can attain Swaraj within 24 hours provided I relinquish my demand for Hindu-Muslim Unity, I shall retort to it: ' No my friend, I shall give up Swaraj, but not Hindu-Muslim unity, for if Swaraj is delayed, it will be a loss for India, but if Hindu-Muslim unity is lost, it will be a loss for the whole of mankind. - Understnding Muslim Mind, Rajmohan Gandhi, Penguin Books, 1986, Page 230 )

ఆనాడు మౌలానా ఆజాద్ హిందూ ముస్లింల ఐక్యత అతి ముఖ్యమని కోరుకుంటే అష్ఫాఖుల్లా ఖాన్ ఆర్థిక–సామాజిక అంతరాలు లేని సమసమాజ వ్యవస్థగల ఇండియా ముఖ్యమన్నారు.

## హిందూ-ముస్లిం ఐక్యతాభిలాషి

సమసమాజానికి అధిక ప్రాముఖ్యత ఇచ్చిన అష్ఫాఖ్ హిందూ–ముస్లిం ఐక్యతకు కూడా అంతటి స్థానం కల్పించారు. మౌలానా అబుల్ కలాం స్థాయిలో హిందూ –ముస్లింల ఐక్యతకు ప్రతీకగా నిలిచారు. ఈ విషయాన్ని బిస్మిల్ ప్రస్తావిస్తూ, **నీవెప్పుడూ హిందూ – ముస్లిం ఐక్యతనే కాంక్షిస్తూండేవాడివి. నీవొక నిజమైన ముస్లింగా, నిజమైన దేశభక్తునిగా ఉన్నావు.** (ఆత్మకథ : పేజి.106) అని రాసుకున్నారు.

**హిందూ–ముస్లింల మధ్యన ఉన్న అనైక్యత పలితంగా బ్రిటీషర్ల పెత్తనం సాగుతుంది. ఈ అనైక్యత ఫలితంగా ఇండియా ఆంగ్లేయుల పరమైపోయింది. ఆంగ్లేయులు డబ్బు, పదవులు ఆశ చూపి మనల్ని చీల్చి పబ్బం గడుపుకుంటున్నారు. ఈ విషయంలో పెద్ద పెద్దవాళ్ళు కూడా అతీతంగా లేరు. నేను మరణిస్తున్నాను. నా దేశం కోసం మరణిస్తున్నాను. నా మాట వినండి ఐక్యంగా వ్యవహరించండి,** అని అష్ఫాఖుల్లా ప్రజలను కోరారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.119)





ఆనాడు ఆర్యసమాజీకులు శుద్ధి సంఘటనల ద్వారా, ముస్లింలు తబ్లిఖ్ సంస్థల ద్వారా చేస్తున్న మత మార్పిడులను అష్ఫాఖుల్లా నిరసించారు. మనదేశంలో మతం పేరిట జరుగుతున్న సంఘర్షణలు పాలక వర్గాల కుట్రలని హెచ్చరించారు. మత మార్పిడులకు పాల్పడుతున్న సంస్థలను ఉద్దేశించి మాట్లాడుతూ, ఆనాడు దేశంలో ఉన్న ఏడు కోట్ల ముస్లింలను హిందువులుగా, ఇరవైరెండు కోట్ల హిందువులను ముస్లింలుగా ఎవరైనా మార్చగలరా? అన్నారు. హిందూ–ముస్లిం మతమార్పిడిదారులను ప్రశిస్తూ, ఆ ప్రయత్నాలను విరమించమని ఆయన కోరారు.

(He addressed the members of both the communities Hindus and Muslims and openly expressed his view that it is impossible that seven crores of Muslims be converted to Hinduism and equally impossible was the proposition that twenty two crores of Hindus be converted to Muslim faith ' - Great Revolutionary Martyr Ashfaqullah Khan, Dr.Omkar Nath Tripathi, Basha Sangam, Allahabad, 2001, Page.7)

బానిసలుగా బతుకుతున్న వారికి మతమేంటి? బానిసలు తమ ఇచ్ఛవచ్చిన రీతిలో తమ మతధర్మాలను పాటించగలరా ? మీరు మీ మతాన్ని సంస్కరించగలరా? అది సాధ్యమా ? అని అష్ఫాక్ ప్రజలను ప్రశ్నించారు. మతం కంటె స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రధానమని ఆయన ప్రకటించారు. బ్రిటీషర్ల బానిసత్వం నుంచి బయటపడాలని, ప్రజలంతా మత విభేదాలను మరచి సమైక్యం కావాలని పిలుపునిచ్చారు. ఎవరి మత ధర్మాలను వారు ప్రశాంతంగా పాటించండి. అందరితో సవ్యంగా వ్యవహరించండి. అంతా కలసి శ్వేత భూతాన్ని మంత్రం లేక తంత్రంతో గద్దె దించి తరిమి కొట్టండి. ఈ భూతం దేశం వదలి వెడితే అంతా సవ్యంగా ఉంటుంది. మీరు ఈ విషయాన్ని ఆవలోకించండి. మీరు ముందు ఇండియాను విముక్తం చేయండి. ఆ తరువాత మిగతా విషయాలను ఆలోచించండి. దేవుడు ఎవరికి ఏమార్గం చూపుతాడో ఆతను ఆ మార్గంలో సాగుతారు. ఎవ్వరూ కూడా ఆ దారుల నుండి మరెవ్వరినీ మళ్ళించ లేరు. మీరంతా ఐక్యం కండి. బలపడండి. లేనట్లయితే మన హిందూస్థాన్ యావత్తు నాశనమై పోగలదు, తస్మాత్ జాగ్రత్త అని ఆయన హిందూ–ముస్లిం జనసమూహాలకు పిలుపివ్వటంతో పాటుగా హెచ్చరికలు కూడా జారీ చేశారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.120)

అష్ఫాఖ్ చివరి క్షణం వరకు హిందూ-ముస్లింల మధ్య ఐక్యతను ఆకాంక్షించారు. ఆ దిశగా కృషి చేశారు. ఆయనకు విధించిన ఉరిశిక్ష మరో మూడు రోజులలో అమలవుతుందనగా, 1927 డిసెంబరు 16వ తేదీన ఫైజాబాద్ జైలు నుండి దేశవాసులను ఉద్దేశిస్తూ ఒక లేఖ రాసారు.

ఆ లేఖలో, **భారతదేశ సోదరులారా మీరు ఏ మతానికి, సంప్రదాయానికి చెందిన వారైనా సరే, దేశసేవలో కృషిచేయండి. వృధాగా పరస్పరం కలహించకండి. అన్ని పనులూ ఒకే లక్ష్యాన్ని సాధించేందుకు సాధనాలు. అలాంటప్పుడు ఈ వ్యర్థపు కొట్లాటలూ, కుమ్ములాటలు ఎందుకు? ఐకమత్యంతో దేశంలోని దౌరతనాన్ని ఎదిరించండి. దేశాన్ని స్వతంత్రం చేయండి...చివరగా అందరికి నా సలాం. భారతదేశం స్వతంత్రమగుగాక. నా సోదరులు సుఖంగా ఉందురు గాక,** అంటూ ఆ చారిత్రకమైన లేఖను అష్ఫాఖుల్లా ఖాన్ ముగించారు. (జ్ఞాపకం ఉంచుకోండి ఎప్పుడైనా...(అమర వీరుల ఉత్తరాలు), అనువాదం : జె. లక్ష్మి రెడ్డి, భారత ప్రభుత్వం ప్రచురణలు, న్యూ డిల్లీ, 19980 పేజి. 43).

ఆనాడు అష్ఫాఖుల్లా ఖాన్ భిన్న మతస్థుల మధ్య సమైక్యత, సద్భావన, సహిష్ణుత ను ప్రగాఢంగా వాంచించారు. ఈ ఐక్యత ద్వారా మాత్రమే పరాయిపాలనకు చరమగీతం పాడగలమని ఆయన భావించారు. ఈ అభిప్రాయంలో ఆనాడు ఆయన పలికిన అజరామరమైన మాటలను ఈనాటి పరిస్థితులకు కూడా మనం అన్వయించుకోవచ్చు.

హిందూ-ముస్లింల మధ్యన ప్రగాఢమైన ఐక్యతను కాంక్షించిన అష్ఫాఖుల్లా జీవిత చరమాంకం వరకు ఆ దిశగా కృషి చేస్తూ, ఐక్యతకు, స్నేహబంధానికి, పటిష్టమైన లౌకిక వ్యవస్థకు ప్రతీకగా నిలచారు. ఆ కారణంగా ప్రముఖ విప్లవ కారుడు శ్రీ మన్మధనాథ గుప్త, బిస్మిల్ అత్మ కథకు ముందుమాట రాస్తూ, **రాంప్రసాద్, అష్ఫాఖ్‌ల ప్రగాఢ మైత్రి పాత తరహా లౌకికవాదపు అత్యున్నత దశ అని చెప్పవచ్చు**, అని పేర్కొన్నారు. (బిస్మిల్ ఆత్మకథ : పేజి. IV)

## ఐక్య పోరాటాలకు అద్వితీయ ప్రాధాన్యత

స్వేఛ్ఛా భారతావనిని కాంక్షించిన అష్ఫాఖుల్లా ఐక్యతను భంగపర్చే ప్రతి అంశం పట్ల అత్యంత శ్రద్ధ చూపారు. ప్రతి చిన్న విషయాన్ని కూడా పరిగణలోకి తీసుకుని, ఆ సమస్యలను ప్రజల దృష్టికి తెచ్చే ప్రయత్నం చేశారు. జైలు గోడల మధ్య నుండి ఉరిశిక్ష కోసం ఎదురు చూస్తూ కూడా ఆయన భవ్యభారతం కోసం కలలు కన్నారు. ఆ కలలను





పండించేందుకు మతస్థుల మధ్యన మాత్రమే కాదు, ప్రజా సంఘాలు, రాజకీయ పార్టీలు, మత సంస్థలు అన్నికూడా ఐక్యంగా ఉండాలని ఆకాంక్షించారు. ఐక్యతకు భూమికగా మాతృభూమి విముక్తి కోసం అన్నివర్గాలు ఆంగ్లేయుల మీద పోరుసల్పాలని, ఉవ్వెత్తున ఉద్యమించాలని ప్రజలకు పిలుపునిచ్చారు.

మనలోని అనైక్యత మూలంగా మనం పరాయిపాలకులకు బానిసలవుతున్నామని విచారం వ్యక్తం చేశారు. ఈ నేపథ్యంలో మనల్ని అంతమొందిస్తున్నది ఎవ్వరో కాదు మనలోని అనైక్యత మాత్రమే మనల్ని అంతం చేస్తున్నది, అని ప్రకటించారు. మనవాళ్ళే మన అంతానికి కారణమౌతున్నారనే భావంతో ఆంగ్లేయుడూ కాదు, జర్మనీవాడు కాదు, రష్యన్ కాదు, టర్కీవాడు కాదు, మనల్ని అంతం చేస్తున్నవాళ్ళు మన హిందూస్థానీయులే అని అన్నారు. ఈ మేరకు తాత్విక భావనలను కూడా వ్యక్తం చేస్తూ, ప్రార్థనలు-పిటీషన్ల సంస్కృతి ఇక వద్దన్నారు. ఆవేశపు పొంగులు గల ప్రజలు తనను చిత్రహింసలు పెడుతున్న వాడ్ని దేశం బయటిదాకా తరిమి తరిమి కొడతారని ఆయన ఆకాంక్షించారు. ఈ విషయమై ఆయన రాసిన ఉర్దూ కవితకు తెలుగు తర్జుమా క్రింది విధంగా సాగింది.

**వాడు కాదు తెల్లవాడు, వాడు కాదు అంతకన్న జర్మని వాడు - రష్యా వాడు కానేకాదు, కాదు వాడు టర్కీవాడు - హిందూస్తానీయుడు తలారి వాడు- నన్ను చంపువాడు నేడు- పాపం! మురిసిపోతున్నారులా ఉంది నన్ను నాశనం చేసేశామని-వారు ఎవర్నయితే నాశనం చేసేశామని భావిస్తున్నారో - గ్రహించనే లేదు అసలు రహస్యం వారు - నాశనం చేయకుండానే నశించిపోయేవాణ్ని నేను - మరి లక్షసార్లు ప్రయత్నం దేనికి ? - వద్దు వద్దు 'విన్నపాలు' ! వద్దు వద్దు 'విన్నపాలు' ! - వుంటే గింటే ఆవేశపు పొంగు దేశ జనం గుండెల్లో - తరిమి తరిమి కొడ్తారు దేశం బయటిదాకా - నేడు నన్ను చిత్ర హింసల పాలుజేస్తున్న వాణ్ణి !** (ఉర్దూ మూలం: అష్ఫాఖుల్లా ఖాన్, తెలుగు సేత : నాజిర్, ప్రజాసాహితి మాసపత్రిక, డిసెంబరు 2000.)

## ఆది నుండి శ్రమజీవుల పక్షపాతి

భారత స్వాతంత్రోద్యమంలో కార్మిక-కర్షక జనుల ప్రాతినిధ్యం అత్యవసరమని అష్ఫాఖ్ భావించారు. చిన్నతనం నుండి తమ జమీందారి కుటుంబీకులు ప్రవర్తనకు భిన్నంగా వ్యవహరించారు. శ్రమజీవులైన కార్మికులు - కర్షకులు పడుతున్న వెతలు తీరాలని ఆరాటపడ్డారు. ఈ రుగ్మతలకు పరాయిపాలన కారణమని భావించారు. అందువలన వలస పాలనకు స్వస్తి పలకాలన్నారు. భారతదేశ సౌభాగ్యం శ్రమజీవుల

మీద ఆధారపడి ఉందన్నారు. శ్రమకు తగ్గ ప్రతిఫలం శ్రమజీవులకు దక్కడం లేదని ఆవేదన చెందారు. ఈ దుర్భర పరిస్థితులకు పాలకవర్గాలు, పాలకవర్గాల తొత్తులైన జమీందారులు, ఆ జమీందారుల ప్రతినిధులు కారణమన్నారు. జమీందారులను పంట భూముల్లోకి రప్పించాలని, వారిచేత సేద్యం చేయించాలన్నారు. ఈ విషయాలను అష్ఫాఖ్ చాలా స్పష్టంగా వివరించారు.

అష్ఫాఖ్ తన ప్రగతిశీల అభిప్రాయాలకు సక్రమమైన రీతిలో అక్షర రూపం ఇవ్వలేకపోయారు. అంతటి సమయం ఆయనకు లేకపోయింది. ఆయన రాసిన లేఖలు, డైరీలు మాత్రమే కొంత వరకు ఆయన ఆలోచనలను వెల్లడిస్తున్నాయి. ఆయన రాసిన లేఖలన్నీ కూడా అందుబాటులోకి రాలేదు. ఆయన అన్నగారింట దొంగలు పడి సొత్తు, సామాగ్రితో పాటుగా అష్ఫాఖ్ రాసిన లేఖలను కూడా ఎత్తుకుపోయారు. ఈ దొంగతనం వలన అమూల్యమైన ఆయన లేఖలు చరిత్రకు అందకుండా పోయాయి. ఈ కారణంగా ఆయనను సమగ్రంగా అధ్యయనం చేయడానికి చరిత్రకారులకు వీలులేకుండా పోయింది.

శ్రమజీవుల పరిస్థితులను వివరిస్తూ, **పేదరైతుల, దుఃఖితులైన కార్మికుల స్థితిగతుల పట్ల నా హృదయం ఎల్లప్పుడూ ఆవేదనకు గురవుతుంది. ఈ వర్గాల దుర్భర జీవితాలను చాలా సమీపం నుండి గమనించాను. నాకు సాధ్యం అయ్యేట్టయితే ప్రపంచంలోని సకల సౌకర్యాలను వారికి అందచేయాలని నా మనస్సు కోరుకుంటుంది. మన పట్టణాలలోని సౌభాగ్యం వీరి శ్రమ వలన వచ్చి చేరుతోంది. మన కర్మాగారాలు వీరి వలన నడుస్తున్నాయి. మన కుళాయిలలో మంచినీళ్ళు కూడా వీరి వలన మాత్రమే లభిస్తున్నాయి. మనం అనుభవిస్తున్న అన్ని సౌకర్యాలు ఈ వర్గాల శ్రమ వలన మాత్రమే దక్కుతున్నాయి.**

**పేదరైతు వర్షంలో తడుస్తూ, మండుటెండలో మాడుతూ మన కోసం ఆహార ధాన్యాలను పండిస్తున్నాడు. పండించిన ధాన్యంలో రైతుకు, తన శ్రమతో తయారు చేసిన సరుకులో కార్మికునికి సరైన వాటా లభించడం లేదన్నది వాస్తవం. ఈ పరిస్థితులకు పాలకవర్గాలు, జమీందారులు, వారిప్రతినిధులు కారణమవుతున్నారు. ఈ సమస్యకు పరిష్కారం ఏంటీ?**

**ఆ ప్రభువులను, జమీందారులను, ఏజెంట్లను కార్మిక, కర్షక జనుల పరిస్థితులను తెలుసుకునే స్థితికి తీసుకురావాలి. జమీందారులు తమ జమీన్‌ను వదులుకుని రైతుల్లాగే పొలాల్లో పంటలు పండించే పరిస్థితి కలుగచేయాలి. మనం కర్మాగారాలలో స్థానం సంపాదించి కార్మికులకు వారి స్థితిగతులను తెలియచేసి వారిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించాలి. మీరు గ్రాండ్‌మాస్టర్ ఆఫ్ రష్యా, కేథరిన్ జీవిత చరిత్ర చదవండి.**





**అక్కడి నేతల త్యాగాలను తెలుసుకోండి. మీరు మంచి టై, కోటు లాంటి దుస్తులు ధరించి తప్పకుండా నాయకులు కాగలరు. కాని కార్మికులు, కర్షకులకు ఏమాత్రం మేలు చేయలేరు,** అని అష్ఫాఖుల్లా ఖాన్ అన్నారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Pages.11 and 121)

శ్రమజీవులతో కలసిమెలసి పనిచేస్తు, వారిని చైతన్యవంతుల్ని చేయమని సూచించారు. శ్రమజీవుల జీవితావసరాలను, కష్టసుఖాలను తెలుసుకోలేని నాయకత్వం శుద్ధ దండగని, శ్రమజీవుల సంక్షేమం పట్టని నాయకుల మీద అష్ఫాఖుల్లా ఖాన్ చురకలు వేసారు. శ్రమజీవుల సంక్షేమం కోసం చిత్తశుద్ధితో నాయకత్వం తయారు కావాలని, అందుకు మంచి సాహిత్యాన్ని సృష్టించాలని, అటువంటి సాహిత్యాన్ని అందరూ చదవాల్సిన అవసరం ఉందన్నారు.

సమాజంలో సాగుతున్న దోపిడికి కారణం ఎవరూ? శ్రమజీవులకు శత్రువు ఎవరూ? అనే అంశం మీద కూడా అష్ఫాఖ్‌కు ఖచ్చితమైన అవగాహన ఉంది. ఈ విషయమై ఆయన మాట్లాడుతూ, **దోపిడీ దారుడు దోచుకున్న సొత్తుతో, పీడించేవాడు పీడితుల సౌభాగ్యంతో తన కడుపులను నింపుకుంటారు. వకీళ్ళు కక్షిదారుల, జమీందారులు కౌలుదారుల, పెట్టుబడిదారుడు కార్మికుల కష్టార్జితాన్ని జలగలు రక్తాన్ని పీల్చుకున్నట్టు పీల్చుకుంటారు. వీరంతా శ్రమ చేయని పనిదొంగలు. అందువలన దోపిడీకి పాల్పడుతుంటారు. ఈ దోపిడిని అంతం చేయడం అత్యవసరం. ఈ శక్తులకు వ్యతిరేకంగా యుద్ధం తప్పదని,** అష్ఫాఖుల్లా ఖాన్ ప్రకటించారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.107)

ఈ విషయాన్నే ఆయన కమ్యూనిస్టు గ్రూపు మిత్రులతో అనేవారు. ఈ భావాలను బట్టి తనను ఎవరు కమ్యూనిస్టుగా భావించినా లేక మరోకటిగా భావించినా తనకు ఎటువంటి అభ్యంతరం లేదని కూడా అష్ఫాఖుల్లా ఖాన్ ప్రకటించారు. ఈ రకంగా ఆలోచనలు చేసిన మొదటి విప్లవకారుడాయన, అని శ్రీ సుధీర్ విద్యార్థి పేర్కొన్నారు.

## విప్లవోద్యమానికి నిధుల కొరత

మాతృభూమి పట్ల అత్యంత గౌరవాభిమానాన్ని వ్యక్తీకరించి, దేశం కోసం మరణాన్ని కూడా ఆహ్వానించే అష్ఫాఖుల్లా లాంటి ప్రగతిశీల భావాలు, నిస్వార్థ చింతనా పరులైన యువకులు విప్లవోద్యమానికి జవం జీవం అయ్యారు. మాతృభూమి విముక్తి కోసం కంకణం కట్టుకున్న విప్లవకారుల మూలంగా విప్లవ కార్యకలాపాలు ముమ్మరమయ్యాయి. బెంగాల్ ప్రధాన కేంద్రంగా విప్లవకారులు దేశమంతటా పరివ్యాప్తి కాసాగారు.

ఉత్తరప్రదేశ్, బీహార్ రాష్ట్రాలలో విప్లవోద్యమం పకడ్బందీగా సాగుతోంది. పలు పట్టణాల్లో విప్లవ కేంద్రాలు ఏర్పడ్డాయి. విప్లవకారులు నిర్వహిస్తున్న 'యాక్షన్స్' విజయవంతం అవుతుండటంతో రెట్టించిన ఉత్సాహంతో అష్ఫాఖ్ లాంటి దేశభక్తి పూరితులైన యువకులు రహస్య విప్లవ దళాలలో సభ్యత్వం స్వీకరించసాగారు. ఆ రోజుల్లో సహాయ నిరాకరణ ఉద్యమాన్ని గాంధీజీ రద్దు చేయటం, జాతీయ కాంగ్రెస్ కొంత కాలం వరకు ఆ ఉద్యమం స్థానంలో మరోక ఉద్యమరూపాన్ని ప్రజలకు చూపక పోవటం వలన ఏర్పడిన నిస్తేజ పరిస్థితులలో విప్లవోద్యమం పురుడుపోసుకుంది.

ఈ వాతావరణాన్ని శ్రీ రాం ప్రసాద్ బిస్మిల్ మరింత పరిపుష్టం చేయాలను కున్నారు. పలు ప్రాంతాలలో విప్లవ కేంద్రాలను ప్రారంభించాలని, సాహసులైన యువకు లను భారీ సంఖ్యలో దళంలోకి తీసుకోవాలని, విప్లవోద్యమానికి ప్రజల మద్దతు సంపాదిం చేందుకు ప్రజలను చైతన్యం చేయడానికి సామాజిక వికాస సేవా కేంద్రాలను ప్రారంభిం చాలని, గ్రంథాలయాలను ఏర్పాటు చేయాలని పలు పథకాలు రూపొందించారు. విప్లవ సాహిత్యాన్ని ప్రచురించి విస్తృతంగా పంపిణీ చేయాలని ఆయన భావించారు.

ఈ పథకాలను అమలు చేయడానికి ఆర్థిక వనరుల కరువయ్యాయి. విముక్తి పోరాటంలో ప్రాణాలను సైతం పణంగా పెట్టగల త్యాగధనులైన యువకులను విప్లవోద్యమం సమకూర్చుకోగలిగినా ఆర్థిక లోటు తీరకుంది. ఆ కారణంగా కార్యక్రమాలు ముందుకు సాగటంలేదు. అందువలన ఆర్థిక బలం కోసం బిస్మిల్ అన్వేషణ సాగించారు. ఆ అన్వేషణలో భాగంగా ప్రభుత్వ ఖజానాను, ప్రభుత్వానికి వత్తాసు పలికే జమిందారులను దోపిడి చేయాలని నిర్ణయించిన విప్లవకారులు పలు యాక్షన్స్‌ను విజయవంతంగా నిర్వహించారు.

ఈ పరిస్థితి పాలక వర్గాలలో తీవ్ర కలవరానికి కారణమైంది. ప్రభుత్వం నిఘాను తీవ్రతరం చేసింది. రహస్య పోలీసుల హడావుడి ఎక్కువైంది. విప్లవకారులకు ఎటువంటి సహాయ సహకారాలు లభించకుండా, కట్టుదిట్టమైన చర్యలను ప్రభుత్వం చేపట్టింది. విప్లవకారులకు తీవ్ర ప్రతికూల పరిస్థితులు ఏర్పడ్డాయి. ప్రభుత్వ చర్యల వలన విప్లవ కారులకు ఆర్థికంగా చాలా గడ్డు రోజులు దాపురించాయి. విప్లవ సంఘాలలోని కార్యకర్తల కనీస ఖర్చులకు, చివరకు భోజన సదుపాయాలకు కూడా నిధులు కరువయ్యాయి. ఈ విషయాలను బిస్మిల్ స్వయంగా చెప్పుకున్నారు. **అప్పటిలో సంఘసభ్యుల ఆర్థిక స్థితిగతులు**





**కడు దయనీయంగా ఉండినాయి. శెనగలు బుక్కి బతుకుదామన్నా అవైనా కొనలేని స్థితి. ఎవరి వద్దా ఒంటినిండా బట్టలు లేని రోజులవి. కొంతమంది విద్యార్థులుగా మారి ధర్మసత్రాల్లో, గుళ్ళు, పుణ్యతీర్థాలలో ఉచిత భోజనాలకు వెళ్ళేవారు...ఈ దుస్థితి గాంచి నాకెంతో క్లేశం కలగసాగింది. యువకుల శుష్కవదనాలను చూసి, అయ్యో స్వదేశ సేవాకార్యంలో నిమగ్నమవడం వల్ల బిచ్చగాళ్ళకంటే అధ్వాన్నస్థితి దాపురించిందేమని కుములుతూ తరచూ ఏడ్చేవాడిని,** (బిస్మిల్ ఆత్మకథ : పేజి 72-73) అని బిస్మిల్ తన ఆత్మకథలో వాపోయారు.

బలమైన శత్రువును మాతృభూమి నుంచి తరిమి కొట్టేందుకు సాగుతున్న పోరుకు, అంగబలంతో పాటుగా ఆర్థిక, సాయుధ బలం విప్లవోద్యమానికి చాలా అవసరమైంది. ఆయుధాలను సమకూర్చుకోవడానికి తగినంత ధనం కావాల్సి వచ్చింది. ఈ విషయాలను కాకోరి కేసులో అష్ఫాఖ్‌తో పాటుగా విచారణ ఎదుర్కొని పదిసంవత్సరాల జైలు శిక్షను అనుభవించిన శచీంద్రనాథ్ బక్షీ ఒక వ్యాసంలో ఈ విధంగా వివరించారు. **1925 సంవత్సరం వచ్చేదాకా ఉత్తరప్రదేశ్‌లో విప్లవ పార్టీ నిలదొక్కుకుని, చురుకుగా కదులు తోంది. జూలై చివరి వారంలో జర్మనీ నుంచి స్టీమర్లో పిస్తోళ్ళ చలానా వస్తుంది. పిస్తోళ్ళు కలకత్తా పోర్టు చేరడానికి ముందే డబ్బుని నగదు రూపంలో జమకట్టాలి. అందుకు చాలా నగదు కావాలి. పార్టీ దగ్గర అంత సొమ్ము లేదు. దోపిడికి దిగడం తప్ప పార్టీకి మరో మార్గం లేకుండా పోయిందని,** ('కాకోరి కుట్ర కేసు నడిచిన విధం' (వ్యాసం), వ్యాసరచయిత: శచీంద్రనాథ్ బక్షీ, అనువాదం: విపుల్ చక్రవర్తి, ప్రజా సాహితి, డిసెంబరు 2000 నాటి సంచిక, పేజి. 26)

1925 మార్చి 6వ తేదీన ఫిల్‌ఖిత్ జిల్లాలోని బిచ్‌పూరి గ్రామంలోని బ్రిటీషర్ల తొత్తు ఇంట జరిగిన దోపిడిలో అష్ఫాఖుల్లా ఖాన్ పాల్గొన్నారు. ఆ విధంగానే పలు ప్రాంతాలలో నిర్వహించిన యాక్షన్స్‌లో అష్ఫాఖ్ పాత్ర వహించినప్పటికీ, ఆయనకు ఈ తరహా దోపిడీలు ఇష్టం లేదు. ఈ అదోపిడీల వలన కలిగే ప్రయోజనం కంటే పార్టీ పట్ల ప్రజలలో ఏర్పడే ప్రతికూల అభిప్రాయం ప్రమాదరకమని ఆయన భావించారు. ఆ అభిప్రాయాన్ని అయన తొలుత నుండి వ్యక్తం చేస్తూ వచ్చారు. ఆ విమర్శల పర్యవసానంగా, **మరోమార్గం లేక దోపిడీలకు దిగాలని నిర్ణయానికి వచ్చాము. అయితే ఎవరి వ్యక్తిగత ఆస్తుల్ని కొల్లగొట్టడమన్నా మాకు యిష్టం లేకుండెను. కనుక దోపిడి చేయడమే తప్పనట్టయితే ప్రభుత్వ ధనాన్నే ఎందుకు దోచుకోరాదని యోచించినాము,** అని బిస్మిల్ ఆనాడు తీసుకున్న నిర్ణయాన్ని తెలిపారు. (బిస్మిల్ ఆత్మకథ : పేజి.76)

ఈ మేరకు భవిష్యత్తులో ఎవరి వ్యక్తిగత ఆస్తి కూడా దోచుకోరాదని విప్లవకారులు నిర్ణయించారు. ఆర్థిక వనరుల సమీకరణ కోసం ప్రభుత్వ సొమ్మును మాత్రమే దోపిడీ చేయాలని రాంప్రసాద్ బిస్మిల్ నిశ్చయానికి వచ్చారు.

## ఆది నుండి రైలు దోపిడికి అష్ఫాఖ్ వ్యతిరేకం

ప్రజల ఆస్తులను కాకుండా ప్రభుత్వ ధనాన్ని దోచుకోవాలన్న నిర్ణయం తరువాత బిస్మిల్ ఆ మేరకు పథకం రూపొందించారు. ప్రభుత్వ ఖజానాను తరలిస్తున్న రైలు నుండి ప్రభుత్వ సొమ్మును దోపిడీ చేయాలన్న ఆలోచనను కేంద్ర సమితి ముందుంచి, తన పథకాన్ని సహచరులకు వివరించారు. ఆ పథకం గురించి విన్న పార్టీ సభ్యులయిన యువ విప్లవకారులు పొంగిపోయారు. బ్రిటీష్ ప్రభుత్వం ఖంగుతినేలా ఏదో ఒకటి చేయడానికి మంచి అదను అనుకున్నారు. **ప్రాణత్యాగం చేయాలన్న బలమైన కోరిక ఇప్పుడు మా మనస్సులో సుడులు తిరుగుతోంది. చూడాలి శత్రువు భుజాల్లోని బలమెంతో** (సర్‌ఫరోషీకి తమన్నా అబ్ హమారే దిల్‌మేం హై.. దేఖనాహై జోర్‌కితనా బాజుయే ఖాతిల్ మేం హై) అంటూ మౌలానా హసరత్ మోహాని రాసిన ఉత్తేజపూరిత గీతాలాపన చేయసాగారని శచీంద్ర బక్షీ తెలిపారు. (ప్రజా సాహితీ డిసెంబరు 200, పేజి. 27).

ఈ ప్రతిపాదనను సమావేశానికి హాజరైన సభ్యులలో అష్ఫాఖ్ తప్ప మిగిలిన వారంతా అంగీకరించారు. మిత్రులందరి ఆలోచనలు విన్న తరువాత అష్ఫాఖ్ నింపాదిగా మాట్లాడుతూ, **దళం ఇంకా బలోపేతం కాలేదు, ప్రభుత్వంతో నేరుగా తలపడగల శక్తి మనకు ఇంకా సమకూరలేదు, అందువలన మనం ముందు పార్టీని పటిష్టం చేసుకోవాలి, పార్టీని విస్తృతపరచుకోవాలి. ప్రభుత్వానికి ఇటువంటి సవాల్ విసరడం ఆత్మహత్యా సదృశ్యం కాగలదు. ఈ సంఘటన జరిగితే ప్రభుత్వం దళసభ్యుల మీద చాలా దారుణంగా విరుచుకు పడగలదు. విప్లవోద్యమం మనుగడ ప్రమాదంలో పడగలదని,** ఆందోళన వ్యక్తం చేసారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.34)

ఈ మేరకు తన అభిప్రాయాన్ని స్పష్టం చేస్తూ విప్లవోద్యమం మనుగడ దృష్ట్యా ఈ నిర్ణయం మంచిది కానందున తాను వ్యతిరేకిస్తున్నాని అష్ఫాఖుల్లా ప్రకటించారు. ఈ పథకాన్ని నిలుపుదల చేయడం మంచిదని చివరి వరకు బిస్మిల్‌కు చెబుతూనే ఉన్నారు. ఆయన చేసిన హెచ్చరికలను వినిపించుకునే స్థితిలో మిగతా సహచరులు లేరు. అష్ఫాఖుల్లా







కాకోరి రైలు దోపిడి పథకం గురించి సాగిన చర్చలలో పాల్గొని తన వ్యతిరేకతను స్పష్టం చేస్తున్న అష్ఫాఖుల్లా ఖాన్

తన అభిప్రాయాన్ని యాక్షన్ కోసం బయలు దేరిన లక్ష్యిత రైలు లక్నో వచ్చే దాక చెబుతూనే ఉన్నారు. చివరకు కాకోరి రైల్వే స్టేషన్ చేరుకున్న తర్వాత కూడా ఆయన రాంప్రసాద్ బిస్మిల్‌తో, **నా మాట విను రామ్, ఇప్పటికీ మించిపోయింది లేదు. పద వెనక్కి తిరిగిపోదాం. ఈ యాక్షన్ జరగకూడదు. ఈ ప్రయత్నం మనకు నష్టదాయకం కాగలదు సుమా,** అంటూ చివరి వరకు మొత్తుకున్నారు.

## చరిత్ర సృష్టించిన కాకోరి రైలు దోపిడి

ప్రభుత్వ ఖజానాను దోపిడీ చేయడానికి పథకం సిద్ధమైంది. విప్లవ దళంలోని సభ్యులకు బాధ్యతలు అప్పగించారు. ఈ యాక్షన్‌లో పాల్గొనేందుకు 10 మందితో కూడిన దళం అన్ని విధాల సిద్ధమైంది. షాజహాన్‌పూర్ నుండి లక్నో వెడుతున్న 8 డౌన్ ప్యాసింజరు రైలును 1925 ఆగష్టు 9వ తేదీన కాకోరీ–ఆలంనగర్ స్టేషన్ల మధ్య ఆపి, ఆ రైలులో తరలించబడుతున్న ప్రభుత్వ ఖజానాను దోచుకోవాలని పథకం రూపొందింది.

ఈ యాక్షన్‌లో అష్ఫాఖుల్లా ఖాన్, మన్మథనాథ్ గుప్తా, చంద్రశేఖర్ అజాద్, రాజేంద్రప్రసాద్ లహరి, కేశవ్ చక్రవర్తి, మురారీలాల్, ముకుందలాల్, శచీంద్రనాథ్ బక్షీ, బిస్మిల్ పాల్గొన్నారు. పథకం ప్రకారంగా రైలు కాకోరి, ఆలంనగర్ మధ్య కాకోరి







రైల్వే స్టేషన్ దాటినాక విప్లవయోధులు రైలు చైను లాగారు. బండి ఆగింది. పదిమంది విప్లవకారులు బండి దిగి, తాము విప్లవకారులమని, ప్రయాణీకులకు ఎటువంటి హానీ చేయమని, రైలులో ఉన్న ప్రభుత్వ ఖజానాను దోచుకుంటున్నామని, ఎక్కడి వారక్కడ రైలు బోగీలలో కూర్చోవలసిందిగా విజ్ఞప్తి చేసారు. గార్డును పిస్తోలుతో భయపెట్టి ప్రభుత్వ ఖజానా గల ఇనుప పెట్టెను అతికష్టం మీద కిందికి దించారు. ఈ పెట్టె చాలా పటిష్టంగా ఉండడంతో మూతను తీయడం కూడా సాధ్యం కాలేదు. పెట్టె మూతను కోసి తొలగించ డానికి ప్రయత్నించినా వీలుకాలేదు.

ఆ పరిస్థితిని గమనించిన అష్ఫాఖ్ తన వద్దఉన్న మౌజర్ పిస్తోలును పక్కన ఉన్న సహచరుడికి ఇచ్చి చాలా బరువైన సుత్తి తీసుకుని ఐరన్ చెస్టును బద్దలు కొట్టసాగారు. సింహబలుడైన అష్ఫాఖ్ దెబ్బలకు ఐరన్ చెస్టు బద్దలయ్యింది. ఆ విధంగా పలగులగొట్టిన ఐరన్ చెస్టు నుండి డబ్బు మూటను బయటకు తీసి దుప్పట్లో వేసుకున్నారు. ఈ విధంగా **కాకోరి రైలు దోపిడీ** సంఘటనగా స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో చోటుచేసుకున్న సాహసోపేత చర్యను నిముషాల్లో పూర్తిచేసుకుని విప్లవకారులు సంఘటనా స్థలం నుండి నిష్క్రమించారు.

అష్ఫాఖుల్లా తన నిర్ణయాలను ప్రకటించటంలో ఎంత స్పష్టంగా ఉంటారో, ప్రజాస్వామ్యబద్ధంగా తీసుకున్న మెజారిటీ నిర్ణయాన్ని కూడా అంతగా గౌరవించి పాటించటం ఆయనకు ప్రజాస్వామం పట్లగల గౌరవానికి చిహ్నం. ఈ విషయాన్ని మరో విప్లవకారుడు, అష్ఫాఖుల్లా సహచరుడు శ్రీశచీంద్రనాథ్ బక్షీ ప్రస్తావిస్తూ, **చివరకు ఎలాగైతేనే అతి కష్టం మీద అష్ఫాఖుల్లా ఖాన్ ఐరన్ చెస్ట్‌ని బద్దలు గొట్టాడు. దోపిడీ మొదలెట్టడానికి ముందు ఈ యాక్షన్‌ని నిరసిస్తూ వచ్చిన అష్ఫాఖ్, దోపిడి ప్రారంభం కాగానే, దానికి పూర్తి సహకారం అందించేడు,** అని ఆనాటి సంఘటన వివరాలు తెలిపారు. (ప్రజా సాహితి, మాసపత్రిక, డిసెంబరు 2000, పేజి. 28)

## విప్లకారుల మీద విరుచుకుపడ్డ ప్రభుత్వం

ఈ **కాకోరి రైలు దోపిడి** సంఘటన దేశవ్యాప్తంగా సంచలనం సృష్టించింది. బ్రిటీష్ ప్రభుత్వం ఖంగుతింది. పోలీసు వ్యవస్థ ఉలిక్కిపడింది. ప్రభుత్వ ఖజానాను దోపిడీ చేయడం, అది కూడా ఒక రైలులో తరలిస్తున్న సొత్తును కన్నుతెరిచి కన్నుమూసేలోగా విప్లవకారుల దళం ఎత్తుకెళ్ళడాన్ని ప్రభుత్వం జీర్ణం చేసుకోలేకపోయింది. ఈ సంచలనాత్మక సంఘటనకు కారకులైన వారి పట్ల అత్యంత కఠినంగా వ్యవహరించాలని నిర్ణయించింది.

ఈ సాహసోపేత సంఘటన ప్రభుత్వానికి సవాల్‌గా మారగా, భారతీయులలో సంతోషానికి కారణమైంది. రాజకీయంగా స్తబ్దత కమ్ముకున్న జాతీయోద్యమంలో కాకోరి రైలు దోపిడి సంఘటన గొప్ప కదలిక తెచ్చింది. ప్రజలలో నూతన ఉత్తేజానికి కారణమైంది. విప్లవకారులను ఉత్తేజితులను చేసింది. పట్టుమని పదిమంది కూడా లేని విప్లవకారులు పెద్ద సంఖ్యలో ఉన్న ప్రభుత్వ బలగాలను ఏం చేయగలరని అపహాస్యం చేస్తున్న రాజకీయ




పక్షాల నాయకులకు కాకోరి వీరులు తగిన సమాధానం ఇచ్చారు. కర్తవ్యదీక్ష, సాహసం, ఉద్యమ నిబద్ధత ఉంటే ఎంతటి బలంగల శక్తినైనా పరాజయం పాల్జేయవచ్చని ఈ సాహసోపేత సంఘటనతో విప్లవకారులు నిరూపించారు.

ఈ సంఘటనతో విప్లవకారులలో ఆత్మవిశ్వాసం బలపడి, మరిన్ని చర్యలకు పాల్పడకముందే, ఆ దిశగా పరిస్థితులు విషమించకముందే కాకోరి యాక్షన్‌లో పాల్గొన్న సభ్యులందరిని అరెస్టు చేసి, అంతం చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ సంఘటన అంతు తేల్చేందుకు విచారణాధికారి సర్ హోర్టన్‌ను ప్రభుత్వం నియమించింది. అందుకు ప్రత్యేక పోలీసు దళాలను, బ్రిటీష్ ఉన్నత అధికారుల బృందాలను ఏర్పాటు చేసింది. అరెస్టులు అత్యంత వేగంగా జరగాలని ఆదేశించింది. విప్లవకారుల అరెస్టులకు నజరానాలు ప్రకటించింది. విప్లవకారుల కోసం అన్ని వైపుల నుంచి పోలీసుల వేట భారీ స్థాయిలో ప్రారంభమైంది. బ్రిటీష్ రహస్య పోలీసుల వ్యవస్థ అప్రమత్తమైంది. విప్లవకారుల కోసం పోలీసులు అంగుళం అంగుళం గాలించడం ఆరంభమైంది.





కాకోరి వద్ద రైలులోని ప్రభుత్వ ధనాన్ని కైవసం చేసుకున్న **హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్** ఆ సొమ్మును లక్నోకు తరలించింది. విప్లవోద్యమ నేత పండిత బిస్మిల్ సొమ్మునంతా వందరూపాయల కరెన్సీలోకి మార్పించారు. ఆ సొమ్ములోని మూడు నోట్లు మాత్రం పొరపాటున షాజహాన్‌పూర్‌లో చలామణిలోకి వచ్చాయి. అవి కాస్తా బ్రిటీష్ విచారణాధికారి హోర్టన్ చేతిలో పడ్డాయి. అప్పటి వరకు కాకోరి కేసు గురించి ఎటువంటి ఆధారం దొరకక సతమతమౌతున్న పోలీసులకు మంచి క్లూ దొరికింది. హోర్టన్ సంబరపడ్డాడు. ఆఘమేఘాల మీద అందిన ఆనవాళ్ళ ఆధారంగా తన బలగాన్ని పరుగులెత్తించాడు.

ఈ విషయాలేవి తెలియని కాకోరి వీరులు అప్పటి వరకు అజ్ఞాతానికి వెళ్ళలేదు. బిస్మిల్, అష్ఫాఖ్‌లు షాజహాన్‌పూర్‌లో స్వేచ్ఛగా తిరుగుతున్నారు. కరెన్సీ నోటు ఆధారంగా పోలీసులు తీగలాగగా డొంకంతా కదిలినట్టు కీలక విషయాలు తెలిసాయి. ప్రభుత్వం ఇక ఏమాత్రం ఉపేక్షించలేదు. ఈ సమాచారం ఆధారంగా దేశంలోని విప్లవకారుల స్థావరాలు, గృహాలు, ఇతర ప్రాంతాల మీద 1925 సెప్టెంబర్ 26 రాత్రి పోలీసుల దాడులు ఒక్కసారిగా జరిగాయి. అన్ని వైపుల నుండి పోలీసు బలగాలు కమ్ముకున్నాయి. ఈ దాడులలో సుమారు 30 మందిని అరెస్టు చేశారు. ఈ పోలీసు దాడులలో శ్రీ చంద్రశేఖర్ అజాద్, శ్రీ శచీంద్రనాథ్ బక్షీ, అష్ఫాఖుల్లా ఖాన్ తప్ప, కాకోరి సంఘటనలో పాల్గొన్న అందరూ దొరికిపోయారు.

## అజ్ఞాతంలో అష్ఫాఖ్

1925 సెప్టెంబర్ 26 రాత్రి పోలీసులు అష్ఫాఖ్ గృహం మీద కూడా దాడి చేశారు. ఆ సమయంలో అష్ఫాఖ్ సోదరులు రియాసతుల్లా ఖాన్ అత్యంత చాకచక్యంగా వ్యవహరించడం, ప్రమాదాన్ని ఎదుర్కొనేందుకు అష్ఫాఖ్ ధైర్యం చేయడంతో పోలీసుల కళ్ళుగప్పి అజ్ఞాతంలోకి వెళ్ళగలిగారు. ఆయన తన ఇంటికి అరమైలు దూరంలో ఉన్న చెరుకు తోటలో కొంతసేపు దాక్కొని, అక్కడి నుంచి పరారయ్యారు. ఆ రోజు రాత్రి జరిగిన విషయాలను రియాసతుల్లా ఖాన్ ఈ విధంగా వివరించారు.

**ఆ రోజు తెల్లవారుజామున నమాజ్ కోసం నిద్రలేచాను. అప్పటికే నా భార్య నమాజ్ చదువుతోంది. ఇంటి గడియ ఎవరో కొడుతున్నారు. వెళ్ళి తీసాను. ఎదురుగా పోలీసు అధికారి ఫసాయత్ హుస్సేన్, ఆయనతోపాటు పలువురు పోలీసులు ఉన్నారు. విషయమేమిటని అడిగాను. సోదా కోసం వచ్చానన్నారు. రాత్రిపూట సోదా ఏంటని**

ప్రశ్నించాను. జిల్లా కలక్టర్ నుండి సోదాకు వారెంట్ ఉందన్నారు. చూపెట్టమన్నాను. పొరపాటున నా చేతికి మరొక ఆజ్ఞాపత్రం ఇచ్చాడు. చదివాను. అది సోదాకు సంబంధించిన ఉత్తర్వు కాదు. అది అష్ఫాఖ్‌ను అరెస్టు చేయమన్న ఉత్తర్వు. ఆ ఉత్తర్వులను త్వరితగతిన చదివేసి, నాకు ఇంగ్లీషు రాదంటూ దానిని తిరిగి ఇచ్చాను. ఆ తరువాత అధికారి సోదాకు సంబంధించిన వారెంట్ చూపాడు. ఇంటిలోకి జొరబడడానికి చాలా తొందరపడుతున్నాడు. నా ఇల్లు ఎందుకు సోదా చేయాలని అడిగాను.

ప్రతాప్‌ఘర్ జిల్లాలో దోపిడి జరిగింది. ఆ సంఘటన విషయమై సోదాలు జరుగు తున్నాయి అని ఫసాయత్ హుస్సేన్ అన్నాడు. గృహంలో ' పర్దానషీ స్త్రీలు ' ఉన్నారని తొందరపడుతున్న పోలీసులను అడ్డగించాను....ఇంట్లో ఉన్న వారందరికి పోలీసులు వచ్చి ఉన్నారని తెలుపుతూ, పోలీసులు తలాషీ కోసం ఇంట్లోకి వస్తున్నారని, మేడ మీదికి వెళ్ళమని నా భార్యకు చెబుతున్నట్లుగా అందరితోపాటు, అఫ్ఫాఖ్‌ను హెచ్చరిం చాను...ఆ హెచ్చరికతో అష్ఫాఖ్ అప్రమత్తమం అయ్యాడు. నా హెచ్చరిక విని గబగబా లేచాడు. తన పెట్టెలో ఉన్న నిషేధిత పత్రిక 'వ్యాన్‌గార్డ్' కాపీలను తీసుకుని క్షణాలలో మేడ మీదకు వెళ్ళిపోయాడు...పోలీసులు ఇల్లంతా గాలిస్తున్నారు. అధికారులు బయట కూర్చుని ఉన్నారు. పోలీసు అధికారి హుస్సేన్ నాతో బాతాఖానీ ప్రారంభించాదరు. మాటల్లో నన్ను ప్రలోభపెట్టేందుకు ప్రయత్నిస్తూ, 'అష్ఫాఖ్‌తో నాకు పరిచయం ఉంది, ఉన్నాడా ? పిలవండి, పిచ్చాపాటి మాట్లాడుకుంటాం' అన్నాడు.

ఆ మాట వింటూనే, నిన్న రాత్రి 12 గంటల ప్రాంతంలో అష్ఫాఖుల్లా ఎక్కడికో వెళ్ళిపోయాడన్నాను. ఆ సమాధానంతో అధికారి కంగారు పడ్డాడు. ఎక్కడికి వెళ్ళాడని అడిగాడు. ఎవరో ఓ పోలీసు అధికారి వచ్చి అష్ఫాఖ్‌ను అరెస్టు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని, ఎక్కడికైనా వెళ్ళిపొమ్మని సలహా ఇచ్చాడని చెప్పాను. ఆ మాటతో ఫసాయత్ హుస్సేన్ మరింత కంగారు పడుతూ ఆ అధికారి ఎవరు? ఎవరని? అడిగాడు. మా శ్రేయోభిలాషి పేరు బయట పెట్టమంటారా? అంటూ నిరాకరించాను. పోలీసు అధికారి చాలా నిరాశపడ్డాడు.నన్ను పోలీసు స్టేషన్‌కు రమ్మన్నాడు. ఆయన వెంట నేను స్టేషన్‌కు నడిచాను.పోలీసు బలగాలతో సహా ఆ అధికారి నిష్క్రమించాడు...నేను పోలీసుల వెంట స్టేషన్‌కు వెళ్ళి తిరిగి వచ్చేసరికి అష్ఫాఖ్ బాల్కనీలో ఉన్నాడు. ఏమిటిదంతా? అని అడిగాను. తాను రివల్యూషనరీ పార్టీలో చేరానని, అది రహస్య విప్లవ సంఘమని చెప్పాడు. అప్పుడుగాని నాకు అసలు విషయం తెలియలేదు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page. 39-41)

ఆ రాత్రి పోలీసుల కన్నుగప్పి అరెస్టు తప్పించుకున్న అష్ఫాఖుల్లా, షాజహాన్‌పూర్





నుండి మారు వేషంలో నేరుగా భోపాల్ వెళ్ళారు. అక్కడ ఎక్కువ కాలం ఉండలేక లక్నో మీదుగా కాన్పూరు వచ్చారు. అక్కడ ప్రతాప్ పత్రిక సంపాదకుడు, విప్లవాభిమాని శ్రీ గణేష్ శంకర్ విద్యార్థిని కలిసారు. ఈ ప్రతాప్ పత్రిక కార్యాలయం ఆనాడు విప్లవకారులకు ప్రధాన కూడలి కేంద్రంగా ఉండేది. సర్దార్ భగత్‌సింగ్‌తో పాటు పలువురు విప్లవకారులు ప్రతాప్‌లో వ్యాసాలు రాసేవారు. శ్రీ విద్యార్థి అష్ఫాఖుల్లా ఖాన్‌కు కొంతకాలం ఆశ్రయ మిచ్చి, అక్కడి నుంచి ఆయనను బెనారస్ పంపారు. బెనారస్ అనాడు విప్లవ కారులకు మంచి స్థావరంగానూ, కేంద్రంగా ఉంది. అక్కడకు వెళ్ళిన అష్ఫాఖ్ హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్‌కు చెందిన ఇతర సభ్యులతో కలసి బీహార్ వెళ్ళిపోయారు.

ఆ విధంగా బీహార్ వెళ్ళే ముందు పోలీసు అధికారుల కళ్ళుగప్పి అష్ఫాఖ్ స్వగ్రామం వచ్చారు. ఆయన అన్న రియాసతుల్లా ఖాన్ కథనం ప్రకారం, **అష్ఫాఖుల్లాఖాన్ అలహాబాద్ ఎక్స్‌ప్రెస్‌లో ఉదయం మూడు గంటలకు షాజహాన్‌పూర్ వచ్చారు. ఆయన సిక్కు యువకుని వేషంలో ఉన్నారు. ఆయన కోసం పోలీసు అధికారులు, సి.ఐ.డి. అధికారులు స్టేషన్ వద్ద కాపుకాసి ఉన్నారు. మారువేషంలో ఉన్న ఆయనను పోలీసులు గుర్తు పట్టలేదు. అష్ఫాఖ్ స్టేషన్ నుంచి తిన్నగా మిత్రుడు 'అలీ ఖైరాదీ' ఇంటికి వెళ్ళారు. పెద్దన్న ముహమ్మద్ షఫీవుల్లా ఖాన్‌ను చూడాలన్నారు. ఆయన వేట కోసం వెళ్ళి, అక్కడ జరిగిన ప్రమాదంలో తుపాకి తూటా తగిలి 15 రోజుల క్రితం చనిపోయారని మిత్రుడు తెలిపారు. ఆ వార్త విని అష్ఫాఖ్ బాగా ఏడ్చారు. బాధపడ్డారు. అన్నయ్య సమాధి వద్దకు వెళ్ళి ప్రార్థన చేసి తిరిగి ఇంటికి వచ్చారు. ఆ రాత్రి పదకొండు గంటల రైలుకు బీహార్ వెళ్ళిపోయారు.** (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.47).

ఆ తరువాత అష్ఫాఖ్ పోలీసుల కన్నుగప్పి షాజహాన్‌పూర్ వచ్చి వెళ్ళారు. ఈ విషయం తెలిసిన పోలీసులు ఉన్నతాధికారులు మండిపడ్డారు. ఆగ్రహించారు. ఆ ఆగ్రహాన్ని అష్ఫాఖుల్లా అన్న రియాసతుల్లా ఖాన్ ఇంటి మీద చూపారు. ఆయన నివాసం మీద దాడిచేసి, ఇంటిలోని సామానులను జప్తు చేసారు. ఈ సందర్భంగా అష్ఫాఖుల్లా ఖాన్ రాసిన లేఖలు, కవితలు, ఆయన తయారుచేసుకున్న నోట్స్‌ను పోలీసులు ఎత్తుకెళ్ళారు. ఇంట్లో వారిని ఆడ మగ తేడా లేకుండా హింసించారు. పోలీసులు ఎన్నడూ లేని విధంగా చాలా బీభత్సం సృష్టించారని అష్ఫాఖుల్లా సోదరులు మహమ్మద్ రియాసతుల్లా వెల్లడించారు.

అష్ఫాఖుల్లా పరారిలో ఉన్నప్పుడు పంజాబుకు చెందిన ప్రముఖ విప్లవకారుడు శ్రీ లాలా కేదరనాథ్‌తో ఆయనకు పరిచయమైంది. ఆయన అష్ఫాఖుల్లాతో మాట్లా

దుతూ, బ్రిటీషు పోలీసులకు చిక్కకుండేందుకు సరిహద్దులు దాటి పోవాలనుకుంటే నేను సహాయపడగలను. మీకు ఎటువంటి ప్రమాదం రాకుండా మిమ్మల్ని సరిహద్దులు దాటించగలను. అది నాకు చాలా సులువు అన్నారు. స్వదేశం విడిచి వెళ్ళటం అష్ఫాఖ్‌కు ఇష్టం లేదు. శ్రీ లాలా సలహాకు సమాధానంగా, **నేను హిందూస్థాన్ నుండి పరారి కాదలచుకోలేదు. సోదరా! ముస్లింలలో కూడా ఒకరిని దేశం కోసం ఉరికంబం ఎక్కని వ్వండి**, అని మాతృభూమి సేవలో ప్రాణత్యాగం చేయాలన్న తన మనోవాంఛను అష్ఫాఖుల్లా ఖాన్ ఆ సందర్భంగా వెల్లడించారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.47)

# అజ్ఞాతంలో.... కూలీగా అవతారం

బ్రిటీష్ పోలీసుకు టోకరా ఇచ్చి మారువేషాలలో తప్పించుకు తిరుగుతున్న అష్ఫాఖుల్లా ఖాన్ తిన్నగా బీహార్ రాష్ట్రంలోని డాల్టన్ గంజ్ జిల్లా చేరుకున్నారు. ఆ ప్రాంతంలోని ఒక కర్మాగారంలో సామాన్య కూలిగా పనికి కుదిరారు. ఆయన వేషం, భాష మార్చారు. తనను తాను సామాన్య రైతు కుటుంబానికి చెందిన వ్యక్తిగా పరిచయం చేసుకున్నారు. ఓ సామాన్య కూలీగా ఆయన రహస్యజీవితాన్ని ఆరంభించారు.

అష్ఫాఖ్ డాల్టన్ గంజ్‌లోని కర్మాగారంలో పని చేస్తూ చాలా సురక్షితంగా గడిపారు. అక్కడ ఒకసారి జరిగిన కవి సమ్మేళనానికి ఆయన హాజరయ్యారు. అక్కడ ఆయనలోని కవి ప్రదర్శితమయ్యాడు. మంచి ఉర్దూ కవితలను ఆ సందర్భంగా గానం చేశారు. సాహితీ ప్రేమికుల మన్నన పొందారు. అష్ఫాఖ్ పని చేస్తున్న కర్మాగారం యజమానికి ఉర్దూ కవితలు అంటే పంచప్రాణాలు. అష్ఫాఖుల్లా చేత ఆయన మరీ మరీ కవితలు చెప్పించుకుని ఆనందించారు. చక్కని కవిత్వం రాయటమేకాక మనోహరంగా కవితాగానం చేయగల అష్ఫాఖ్ తన వద్ద కొలువుకు ఉండడాన్ని ఆయన చాలా గర్వపడ్డాడు.

అష్ఫాఖ్ ప్రతిభకు సంతోషించిన యజమాని అష్ఫాఖ్ జీతాన్ని భారీగా పెంచాడు. ఈ వాతావరణంలో అష్ఫాఖ్ హిందీని బాగా అభివృద్ధిపర్చుకున్నారు. బెంగాలీలో పాటలు రాయటమే కాకుండా, మనోహరంగా పాడగలిగేంతగా పట్టు సాధించారు. అష్ఫాఖ్ ఎవ్వరికీ ఎటువంటి అనుమానం రాకుండా, కష్టించి పనిచేస్తూ యజమాని ప్రత్యేక ప్రేమాభిమానాలు పొందారు.





# ఉద్యమ స్ఫూర్తిని పండించిన ఉర్దూ కవి

అష్ఫాఖుల్లా ఖాన్ గొప్ప విప్లవకారుడు మాత్రమే కాదు, మంచి ఉర్దూ కవి కూడా, ఆయన తల్లి శ్రీమతి మజహరున్నిసా ఉర్దూ సాహిత్యాభిలాషి. మంచి చదువరి కావడం వలన చిన్న తనం నుంచి అష్ఫాఖుల్లాకు ఉర్దూ సాహిత్యం మీద మమకారం ఏర్పడింది. కవితలను రాయడం ప్రారంభించారు. **హసరత్** అని కలంపేరు పెట్టుకున్నారు. హసరత్ అంటే **లాలస** అని అర్థం. ఆయన **వారసీ** అని మరోపేరుతో కూడా కవితలను రాసారు. ఉర్దూ కవి సమ్మేళనాలలో ఉత్సాహంగా పాల్గొనేవారు. మంచి ఉర్దూలో, బలమైన భావాలతో సాగిన ఆయన కవితలు ప్రజలకు ఉత్తేజితుల్ని గావించేవి. ఆయన భావాలతో ఏకీభవించని వారు కూడా అష్ఫాఖ్ కవితలంటే చెవికోసుకునేవారు. శ్రీ పురుషోత్తం దాస్ టాండన్ లాంటి ప్రముఖులు ఆయన సాహిత్యం అంటే బాగా ఇష్టపడేవారు.

ఉర్దూ భాషంటే ఆయనకు ప్రాణం. విప్లవోద్యమంతో తలమునకలైయున్నప్పుడు కూడా ఆయన ఉర్దూ కవితలు రాయటం మానలేదు. యువకులను విప్లవోద్యమంలో పాల్గొనేలా చేయగల ఉత్తేజపూరిత వ్యాసాలను శ్రీ రాంప్రసాద్ బిస్మిల్ రాసినప్పుడు ఆ వ్యాసాలు ఉర్దూలో రాయటం వలన ఉర్దూ మాతృభాషగా గల ముస్లిం యువత కూడా ఆ ఆలోచనలతో ప్రభావితం కాగలరు కనుక ఆ వ్యాసాలను ఉర్దూలో రాయమని ఆయన బిస్మిల్‌ను కోరేవారు. ఈ విషయాన్ని స్వయంగా బిస్మిల్ ప్రస్తావిస్తూ, **నే నెప్పుడైనా ఏదైనా వ్యాసం లేక పుస్తకం హిందీలో రాస్తే, అప్పుడల్లా నీవు ముస్లింలు కూడా చదవగలిగేందుకు గాను ఉర్దూలో ఎందుకు రాయకూడదని కోరుతుండేవాడివి,** (బిస్మిల్ ఆత్మకథ, పేజి.106) అన్నారు.

ఉర్దూ కవిగా అష్ఫాఖుల్లా ఖాన్ రాసిన ఉర్దూ కవితలు, వ్యాసాలు పోలీసుల సోదాలలో చాలా వరకు పోగా, ఆయనింట జరిగిన దొంగతనంలో మరికొన్ని మాయం అయ్యాయి. ఆ కారణంగా ఆయన సృజించిన ఉర్దూ సాహిత్యం పూర్తిగా ప్రజలకు దక్కలేదు. ఆ కారణంగా ఉర్దూ కవిగా ఆయనను అంచనా వేయడానికి కుదరలేదు. అందినంత వరకు ఆయన గురించి అధ్యయనం చేసిన సాహితీ విమర్శకులు అష్ఫాఖుల్లా ఖాన్ ప్రముఖ ఉర్దూ కవిగా ప్రశంసించారు.

ఆయన ప్రతి కవితలో మాతృభూమి పట్ల గల ప్రేమ, ఆంగ్లేయ ప్రభుత్వం పట్ల ఆగ్రహం, బానిస బ్రతుకుల నుండి బయటపడమన్న ప్రబోధం, అందుకు విప్లవించమని పిలుపు, బ్రతుకు గురించి, దేవుని గురించి తాత్విక భావనలు కన్పిస్తాయి. చివరకు

మరికొద్ది నిమిషాలలో ఉరితీస్తారనగా కూడ ఆయన కవిత్వం చెప్పారు. ఉరివేదిక మీద నుండి కూడ ఉర్దూ కవితలు విన్పించటం విశేషం.

**అష్ఫాఖుల్లాచే విరచిత కవితలలో కొన్ని...**

**ఓ నా మాతృదేశమా సదా నీకు సేవచేస్తూనే ఉంటాను. ఉరి శిక్ష పడినా, జన్మఖైదు విధించినా, బేడిల దరవుతో నీ నామస్మరణ చేస్తూనే ఉంటాను.**
(హే మాతృభూమి తేరీ సేవా కియా కరూంగా, ఫాంసీ మిలే మఝే యా హో జన్మ ఖైద్ మేరీ. బేడి బజా బజా కర్ తేరా భజన్ కరూంగా).

**నా మాతృభూమి కలకాలం స్వతంత్రంగా ఉండాలి. నా దేముంది నేను ఉండొచ్చు, ఉండక పోవచ్చు.**
(వతన్ హమేశాం రహేం సదా ఖాయం ఔర్ ఆజాద్ –
హమారా క్యా హై అగర్ హమ్ రహే రహే నా రహే)

**సహించలేక వారి ఆన్యాయాలూ, ఆత్యాచారాలు చూసి విసిగి పోయి– మేము సైతం ఫైజాబాద్ జైలు నుండి వెళ్ళిపోతున్నాము.**
(తంగ్ ఆకర్ హమ్ భీ ఉన్‌కే జుల్మ్ సే బేజార్ సే –
చల్ దియే సూఏ ఆదం జిందా ఫైజాబాద్ సే.)

**పిరికి వాళ్ళెప్పుడూ చావుకు భయపడుతూ, రోజుకు వందసార్లు మరణిస్తుంటే చూశా. వీరులెన్నడూ చావుకు భయపడగా చూడలేదు. పైగా మృత్యు వేదిక మీద సైతం నవ్వుతూ ఆడుతూంటే చూశా.**
(బుజ్‌దిలోంకో సదా మౌత్‌సే డర్‌తా దేకా,
గోకీ సౌ బార్ ఉన్హేం మర్‌తా దేఖా, వీర్ కో మౌత్ సే హమ్ డర్‌తే నహీం దేఖా, తక్తాయే మౌత్ పర్‌భీ ఖేలాహి కర్తా దేఖా)

**సమస్తమూ నశించి పోయేదే. రూపుమాసిపోయేది నేను ఒక్కణ్ణే కాదు. కేవలం దేవుడే నాశనము లేని వాడు.**
(ఫనా హై సబ్‌కే లియే హమ్ సే కుచ్ నహీ మౌకూఫ్, బకాహై ఏక్ ఫకత్ జాన్–ఎ–కిబ్రియోం కేలియే)

**అతి త్వరలోనే బానిసత్వపు బంధనాలు తెగిపోతాయి. ఆరోజు చూడండి హిందూస్థాన్ అవుతుంది స్వతంత్రం.**





(బహుత్ హి జల్దీహీ టూటేంగే గులామి కీ యే జంజీరేం–
కిసీ దిన్ దేఖనా ఆజాద్ యహ్ హిందూస్తాన్ హోగా)

**ఆమర జీవులు సమాధుల మీద ప్రతి ఏడు పూల మాలలు వేలాడుతాయ్. మాతృభూమి కోసం మరణించే వాళ్ళను గుర్తు చేసే దొక్కటే.**
(షహీదోం కే మజారోం పర్ లగేంగే హర్ బరస్ మేలే–
వతన్ పర్ మర్‌నే వాలోం కా యహీ బాకీ నిషాని హోగాం)

**చావు ఒక రోజు తప్పక రానున్నదన్నప్పుడు ఎందుకు భయపడాలి. మేమెప్పుడు దానిని ఆటనుకున్నాం మరి చావెక్కడా.**
(మౌత్ ఏక్ రోజ్ ఆనీ హైతో డర్‌నా క్యాహై–
హమ్ సదా ఖేల్ హీ సమఝా కియే మరనా క్యా హై)

అష్ఫాఖుల్లా ఖాన్ రాసిన ఓ ఉత్తరంలో ఆయన రాసిన కవిత ఈ విధంగా ఉంది. ఆ లేఖలో, **తోటలో పూల పంట లెస్సగా ఉంది. కానీ ఏమి లాభం? అందులో బుల్‌బుల్ ఉండటం, లేచి పోవటం తోటమాలి ఇష్టా ఇష్టాలతోనే కదా. ప్రేమ మార్గంలో చరించి సమసి కూడా సమసినవాడు కాదు–వల ఇందులో నిరపరాధే. పంజరం నిర్దోషియే. స్వయంగా నా రెక్కల్లో, ఈకల్లో మిళితమై ఉంది. బందీ కావాలనే ఆకాంక్ష. ప్రపంచోద్యాన సృష్టికర్తే రాశాడు నా నొసట–పూల వసంతంలో తోట నుండి భహిష్కృతు డవై, బందీఖానాలో నివాసముండమని**, పేర్కొన్నారు.

ఈ మేరకు అష్ఫాఖుల్లా ఖాన్ దేశభక్తి ప్రపూరితమైన కవితలను చాలా రాశారు. ఆయన కవితలు **హందం** అను ఉర్దూ పత్రికలో ప్రచురితమయ్యాయి. ఆయన పిల్లల కోసం పుస్తకం కూడా రాయాలనుకున్నారు. కాని ఆ కోరిక నెరవేర లేదు. ఆయన ఈ కవితలను ప్రధానంగా అజ్ఞాతంలో ఉన్నప్పుడు, ఆ తరువాత జైలులో ఉన్నప్పుడు రాశారు.

కాకోరి రైలు సంఘటన కేసులో ఉరిశిక్ష పడి, ఆ శిక్ష అమలు అయ్యేంత వరకు ఫైజాబాదు జైలులో ఉన్నప్పుడు కూడా ఆయన రాసిన కవితలలో మాతృభూమిని బ్రిటీషర్ల బానిసత్వం నుండి విముక్తం చేయాలన్న బలమైన ఆకాంక్ష వ్యక్తమౌతుంది. **ఉరిశిక్ష పడినా, యావజ్జీవిత ఖైదు ప్రాప్తించినా మాతృదేశమా నీ నామస్మరణ అనునిత్యం చేస్తూనే ఉంటానని** అష్ఫాఖుల్లా ఖాన్ జైలు గోడల మధ్య నుండి ప్రకటించటం విశేషం.

# రష్యా వెళ్ళాలన్న ప్రయత్నం



అజ్ఞాతవాసం గడుపుతున్న అష్ఫాఖుల్లాకు డాల్టన్‌గంజ్ చాలా సురక్షితంగా, సౌకర్యవంతంగా ఉంది. ఆయన అక్కడ కవిగా కూడా గుర్తింపు పొందారు. మంచి వర్కర్‌గా కూడా యజమాని ఆదరణకు పాత్రులయ్యారు. ఆయనను ఎవ్వరూ గుర్తుపట్టలేని పరిస్థితి. పోలీసుల భయం ఏమాత్రం లేదు. మంచి యజమాని, మంచి ప్రజలు. మంచి సాహితీ వాతావరణం. ఆ ప్రాంతం అన్ని విధాల అనుకూలంగా ఉన్నా ఆయనలోని విప్లవకారునికి ఇవేమీ నచ్చలేదు. సౌకర్యవంత మైన విశ్రాంతి విసుగు అన్పించసాగింది. ఎనిమిది మాసాలు గడిపిన ఆయన ఇంకా అక్కడ ఉండలేక డాల్టన్‌గంజ్ వదలివేయాలని నిర్ణయించుకున్నారు.

అష్ఫాఖ్ అజ్ఞాతంలో ఉన్నప్పుడు ఆయనకు పంజాబ్ ప్రాంతానికి చెందిన ప్రసిద్ధ విప్లవకారుడు శ్రీ లాలా కేదారనాధ్‌తో పరిచయం అయ్యింది. ఆయన ఒకసారి మాట్లాడుతూ, విప్లవకారులు కనుక బ్రిటీషు పోలీసుల కన్నుగప్పి సరిహద్దులు దాటి తప్పించుకోవాలంటే, తాను వారికి సహాయపడగలనని చెప్పి ఉన్నారు. అష్ఫాఖ్ బీహర్ వదలి బయటకు వచ్చి, రష్యా వెళ్లాలన్న ఆలోచన రాగానే ఆయనకు శ్రీ కేదారనాధ్ గుర్తుకు వచ్చారు. ఆ ఆలోచనలకు కార్యరూపం కల్పించేందుకు అష్ఫాఖ్ కాన్పూరు వచ్చారు. కాన్పూరులో శ్రీ గణేష్ శంకర్ విద్యార్థిని కలిసారు. విదేశాలకు వెళ్ళాలన్న ఆలోచనను ఆయనకు తెలిపారు. శ్రీ విద్యార్థి మూడు వందల రూపాయలను అష్ఫాఖ్‌కు ఇచ్చారు.

అక్టోబరు విప్లవం ద్వారా రష్యా ప్రజలు సాధించిన విజయాలను స్వయంగా చూడాలని అష్ఫాఖ్ ఆకాంక్షించారు. ఆ కలలను పండించుకునేందుకు రష్యా వెళ్ళ సిద్ధ మయ్యారు. రష్యా ప్రయాణం ప్రయత్నాలు ప్రారంభించారు. ఆ ఏర్పాట్లు చేసుకోవడానికి అష్ఫాఖుల్లా ఢిల్లీ వెళ్ళారు. ఢిల్లీ చేరుకున్న ఆయనకు కమ్యూనిస్టు నాయకుడు శ్రీ యస్.వి. ఘాటేతో పరిచయమయ్యిందని, ప్రముఖ రచయిత శాంతిమోయ్ రాయ్ తన పుస్తకం **ఫ్రీడమ్ మూవ్‌మెంట్ అండ్ ఇండియన్ ముస్లిమ్స్**‌లో రాసారు. శ్రీఘాటే నుంచి మార్క్సిజం, రష్యా ప్రజల విజయాల గురించి మరిన్ని వివరాలను అష్ఫాఖ్ తెలుసుకున్నారు.





# మిత్రద్రోహం వలన అరెస్టు

అష్ఫాఖ్ రష్యా వెళ్లడానికి ఢిల్లీలో ఉంటూ తగిన ప్రయత్నాలు చేసుకుంటుండగా, ఒక రోజున స్వగ్రామానికి చెందిన ఆయన చిన్ననాటి మిత్రుడు సయ్యాద్ హబీబ్ అహ్మద్ కన్పించాడు. మిత్రులిరువురు చాలా కాలం తరువాత కలుసు కొన్నందుకు సంతోషించారు. స్వగ్రామంలోని బంధుమిత్రుల క్షేమసమాచారాల గురించి ఇరువురు మిత్రులు మాట్లాడుకున్నారు. ఆ సమయంలో సయ్యాద్ హబీబ్ తన మిత్రుడి రష్యా ప్రయత్నాల గురించి తెలుసుకున్నాడు.

అష్ఫాఖుల్లా ఖాన్ ఢిల్లీలో ఉన్న విషయం, ఆయనను తాను కలసిన వైనం సయ్యాద్ హబీబ్ అహ్మద్ స్వగ్రామంలోని తన తండ్రి సయ్యాద్ ముస్తాఖ్ ఆహమ్మద్‌కు తెలిపాడు. ఆ తండ్రి కొడుకులకు సంబంధించి పలు క్రిమినల్ కేసులు ఉన్నాయి. రౌడీషీటు కూడా పోలీసులు తెరచి ఉన్నారు. అటు ప్రభుత్వం ఇటు పోలీసుల నుండి ఆ తండ్రీ కొడుకులు పలు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు.

ఆ కారణంగా ఆ ఇబ్బందుల ఝంజాటానం నుండి విముక్తం కావటమే కాకుండా, ప్రభుత్వం ప్రకటించిన నజరానా పొందటంతోపాటు ప్రభుత్వాధికారుల మనన్న పొందేందుకు అష్ఫాఖ్ మంచి ఉపయుక్త సాధనంగా సయ్యాద్ ముస్తాఖ్ అహమ్మద్‌కు తోచింది. అష్ఫాఖ్‌ను పట్టిస్తే ప్రభుత్వ నజరానా పొందవచ్చని, అధికారుల అనుగ్రహం సంపాదించి తమ మీద ఉన్న కేసులను ఉపసంహరింప చేసుకోవచ్చన్న ఆశ పుట్టింది. ఆ విషయాన్ని కుమారుడు సయ్యాద్ హబీబ్ అహమ్మద్‌కు ఆయన తెలిపాడు. అష్ఫాఖుల్లా మీద కన్నేసి ఉంచమని, ఎటువంటి అనుమానం రాకుండా వ్యవహరించమని కుమారుడికి సలహా ఇచ్చాడు. అష్ఫాఖ్ ఎక్కడ ఉంటున్నాడో తెలుసుకుని ఆ వివరాలను సమయం చూసి పోలీసులకు చేరవేయాల్సిందిగా ఆయన సూచించాడు.

ఈ మేరకు తండ్రి కొడుకులు చర్చించుకుని అష్ఫాఖుల్లాను పోలీసులకు పట్టివ్వాలని నిర్ణయించుకున్నారు. ఆ ప్రకారంగా అష్ఫాఖ్ ఉంటున్న గది రహస్యాన్ని తెలుసుకున్న సయ్యాద్ హబీబ్ అహ్మద్ ఆ సమాచారాన్ని పోలీసులకు తెలిపాడు. ఆ విషయం తెలియని అష్ఫాఖ్ ఆ నమ్మక ద్రోహి మిత్రునితో కలసి భోజనం చేసి తన గదికి వెళ్ళారు. ఆయన ఎప్పటిలాగే తన గదికి చేరుకున్న మరుక్షణమే, పొంచి ఉన్న పోలీసు బలగాలు భారీ సంఖ్యలో వచ్చి ఆ ప్రదేశాన్ని చుట్టు ముట్టాయి. మిత్రుడి నమ్మక ద్రోహం గురించి తెలుసుకుని అష్ఫాఖుల్లా అప్రమత్తమయ్యేలోగా, ఆయనను పోలీసులు అరెస్టు చేశారు.

ఈ మేరకు ఒక సంవత్సరం పాటు బ్రిటీష్ పోలీసుల, గూఢచారుల కళ్ళుగప్పి తప్పించుకు తిరుగుతూ, ప్రభుత్వానికి సవాలుగా మారిన అష్ఫాఖ్ అరెస్టు కావడంతో కాకోరి రైలు సంఘటనలో పాల్గొన్న యోధులలో ఒక్క చంద్రశేఖర్ అజాద్ తప్ప శచీంద్ర బక్షీతో సహా అందరి అరెస్టులు పూర్తయ్యాయి.

## కాకోరీ రైలు సంఘటన యోధులకు శిక్షలు

చరిత్రాత్మక కాకోరీ రైలు దోపిడి సంఘటనలో పాల్గొన్న విప్లవకారుల మీద లక్నోలోని రింగ్ థియేటర్‌లో విచారణ ప్రారంభమైంది. ఈ కేసును ప్రభుత్వం ఒక సవాలుగా స్వీకరించింది. విప్లవకారులను ఎలాంటి పరిస్థితుల్లో కూడా వదలి పెట్టదలచుకోలేదు. ప్రభుత్వం సుప్రసిద్ధ న్యాయవాదులను నియమించుకుంది.

ఈ విచారణ ప్రారంభమయ్యేనాటికి అష్ఫాఖుల్లా ఖాన్, శచీంద్రనాథ్ బక్షీ, చంద్రశేఖర ఆజాద్‌లు అరెస్టు కాలేదు. ఆకారణంగా ఈ ముగ్గుర్ని తప్పించి మిగిలిన అందరి మీద కేసులు నమోదు చేసి ప్రభుత్వం విచారణకు పూనుకుంది. ప్రధాన కేసు విచారణ ఆరంభమైంది. అష్ఫాఖుల్లా, శచీంద్రనాథ్, అజాద్ ల మీద కేసును వేరు చేసి అనుబంధ కేసును తయారు చేసింది. ఆ కేసును వేరుగా విచారించింది.

న్యాయస్థానంలో ప్రధాన కేసు విచారణ ఒకటిన్నర సంవత్సరం సాగింది. మూడు వందలమంది సాక్షులను విచారించారు. ప్రభుత్వం పదిలక్షల రూపాయలను వ్యయం చేసింది. చివరకు 1927 ఏప్రిల్ 6వ తేదీన న్యాయమూర్తి హ్యామిల్‌టన్ తీర్పు చెప్పారు. ఆ తీర్పు ప్రకారం రాంప్రసాద్ బిస్మిల్, రాజేంద్ర లహరి, ఠాకూర్ రోషన్‌సింగ్‌లకు ఉరిశిక్ష, మిగిలిన వారికి వివిధ రకాల శిక్షలు పడ్డాయి. ఈ శిక్షలు విధించిన న్యాయమూర్తి తీర్పు పాఠం కోర్టులో విన్పించిన తరువాత, విప్లవకారులు ఏ దైనా చర్యకు పాల్పడవచ్చని భయపడి ఇంగ్లాండ్ వెళ్ళిపోయాడు. ఈ కేసు ప్రజలను ఉత్తేజితుల్ని చేసింది. అప్పటి వరకు దేశ రాజకీయాలలో ఆవరించి ఉన్న స్తబ్దతను దూరం చేసింది. కాకోరి వీరుల స్ఫూర్తితో పరాయి పాలకుల మీద ప్రజల నిరసన వెల్లువెత్తింది.

## ప్రలోభాలకు లొంగని ధీరుడు

అష్ఫాఖుల్లా ఖాన్‌ను అరెస్టు చేశాక, సహచరుల గురించి, విప్లవోద్యమం గురించి, రహస్యాలను చెప్పమంటూ పోలీసులు చిత్రహింసలు ప్రారంభించారు. కాకోరి రైలు





దోపిడి సంఘటనలో అష్ఫాఖ్‌తోపాటుగా పాల్గొన్న శ్రీ బన్వారిలాల్ ప్రభుత్వ హింసకు, ప్రలోభాలకు లొంగిపోయాడు. విప్లవదళం వివరాలను బయటపెట్టి ఆయన అప్రూవర్ గా మారిపోయాడు. శ్రీ బన్వారిలాల్ లాగే అష్ఫాఖ్ కూడా లొంగిపోతాడని భ్రమించిన పోలీసు అధికారులు ఎన్నిఎత్తులు వేసినా, ఆయన నుండి ఎటువంటి సమాచారాన్ని రాబట్టలేకపోయారు.

ఆ మార్గం ద్వారా ఫలితాలు రాబట్టలేకపోయిన పోలీసులు తమ బాట మార్చారు. అష్ఫాఖ్‌కు ఆశపెట్టి, ప్రలోభాలతో మభ్యపెట్టి అప్రూవర్‌గా మార్చుకుని, విప్లవోద్యమాన్ని దుంపనాశనం చేయాలని పన్నాగం పన్నారు. ఆ ప్రయత్నాలలో భాగంగా, అష్ఫాఖ్ బంధువులు, మిత్రులను రప్పించి, వారికి నచ్చ చెప్పి, భయపెట్టి ఆయన మీద ప్రయోగించారు. అష్ఫాఖ్ కనుక పోలీసులకు విప్లవోద్యమ వివరాలు చెబితే చాలన్నారు. ప్రభుత్వంతో సహకరిస్తే ఉరిశిక్ష తప్పిపోవటమేకాక, సుఖవంతమైన జీవితానికి ఏర్పాట్లు చేయిస్తామన్నారు. ఉరిశిక్షలకు భయపడి, విప్లవ విద్రోహానికి పాల్పడమని హితవు పలుకుతూ, ప్రభుత్వం–పోలీసుల ప్రతిపాదనలతో తన వద్దకు వచ్చిన మధ్యవర్తులను, బంధు మిత్రులను అష్ఫాఖ్ చీదరించుకున్నారు.

అప్పటికీ పోలీసులు తమ ప్రయత్నాలను మానుకోలేదు. డిప్యూటీ పోలీసు సూపరిండెంట్ తస్సద్దిఖ్ హుస్సేన్ ను ప్రభుత్వం ప్రయోగించింది. ఆయన ద్వారా అష్ఫాఖ్‌ను లొంగదీయాలని భావించింది. ఆయన అష్ఫాఖ్‌కు నచ్చచెబుతూ, **రాంప్రసాద్ బిస్మిల్ ఒక హిందువు. ఆర్యసమాజీకుడు. దేశంలో హిందూ రాజ్యం నెలకొల్పడం వాళ్ళ ధ్యేయం. అది ముస్లింల ప్రయోజనాలకు పూర్తిగా విరుద్ధమైనది. ఒక ముస్లింగా నీవు వారి మతతత్వాన్ని నిరసించి, ప్రభుత్వంతో సహకరించు, కాఫిర్లతో సహకరించడం మన మత సంప్రదాయాలకు పూర్తిగా విరుద్ధం కాబట్టి ఒప్పుదల వాంగ్మూలం ఇచ్చి నీ ప్రాణాలను, అలాగే నీ మతం ప్రయోజనాలను కాపాడుకో,** (బిస్మిల్ ఆత్మకథ : పేజి 151) అంటూ అష్ఫాఖ్‌ను మార్గం మళ్ళించేందుకు శత విధాల ప్రయత్నించాడు.

అష్ఫాఖుల్లాను లొంగదీసుకునేందుకు ఆ పోలీసు అధికారి మత మనోభావాల ఆసరా తీసుకున్నాడు. తాను ముస్లిం కనుక అష్ఫాఖ్ మేలు కోరుకుంటున్నందున తన మాట తప్పక వినమన్నాడు. ప్రభుత్వాన్ని ఒప్పించి మేలు చేస్తానని హామీల వర్షం కురిపించాడు. పోలీసు అధికారి హితవును చిరునవ్వుతో అష్ఫాఖుల్లా ఖాన్ విన్నారు. ఆ హితవచనాలు సాగుతున్న సందర్భంగా, **హిందూ రాజ్యస్థాపన** అంటూ తస్సద్దిఖ్ హుస్సేన్ వాడిన మాటలకు సమాధానంగా అష్ఫాఖుల్లా మాట్లాడుతూ, **మీరు నా క్షేమం కోరి**

**హితవు పలికినందుకు ధన్యవాదాలు. అయితే విప్లవకారులు హిందూ రాజ్యం కోసం ప్రయత్నించినా ఇప్పటి ఆంగ్లేయుల నిరంకుశత్వం కంటే, హిందూ రాజ్యమే ముస్లిం ప్రయోజనాలకు మేలని నేను భావిస్తున్నాను. అయితే యావద్భారత ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాటమే విప్లవకారుల ధ్యేయమని నాకు తెలుసు,** (బిస్మిల్ ఆత్మకథ: పేజి 151) అని ఖరాఖండిగా చెప్పారు. ఆ సమాధానంలో ఇక చేసేది లేక ఆ అధికారి తప్పుకున్నాడు.

అంతటితో ప్రభుత్వం, పోలీసు ఉన్నతాధికారులు మిన్నకుండి పోలేదు. ఆ పోలీసు అధికారి ద్వారా మాత్రమే కాకుండా మేజిస్ట్రేట్ అయినుద్దీన్ ద్వారా కూడా అష్ఫాఖ్‌లో మత తత్వ విషబీజాలను నాటి ఆయనను తమ దారికి తెచ్చుకోవాలని నూతన ప్రయత్నాలు ఆరంభించారు. ఆ పథకం మేరకు ఓ రోజున మేజిస్ట్రేట్ అయినుద్దీన్ నక్క వినయాలతో, అతి నమ్రత ప్రదర్శిస్తూ అష్ఫాఖ్ చెంత చేరాడు. ఆయన, ఆయన కుటుంబం మంచి చెడులను విచారించాడు. కాకోరి రైలు సంఘటన ప్రధాన కేసులో ఆయన సహచరులకు పడిన ఉరిశిక్షలు, యావజ్జీవిత కారాగారవాస శిక్షలు తదితర కఠిన శిక్షలను గుర్తుకు తెచ్చాడు. అష్ఫాఖ్‌ను బయపెట్టాడు. ఆ పప్పులేమి ఉడకకపోవటంతో, చివరి అస్త్రంగా మతాన్ని రంగంలోకి తెచ్చాడు.

ఈ సందర్భంగా ఆయన ఎంతో తెలివిగా మాట్లాడుతూ, **ఇదంతా హిందువుల కుట్ర. రాం ప్రసాద్ బిస్మిల్ హిందూ రాజ్యం కోసం పోరాడుతున్నాడు. మీరు ముస్లిం అయిఉండి ఎలా మోసపోయారు**? అంటూ అష్ఫాఖ్ మీద ప్రశ్నలను సంధించాడు. ఆ ప్రశ్న, ఆ ప్రశ్నలోని విభజించి–పాలించు కుతంత్రం, ఆ ప్రశ్నలో దాగిఉన్న మర్మాన్ని గ్రహించిన అష్ఫాఖ్ ఆ అధికారికి సమాధానమిస్తూ, **రాంప్రసాద్ హిందూ రాజ్యం కోసం పోరాడుతున్నాడన్న విషయం అబద్ధం. ఒక వేళ అది నిజమైతే, బ్రిటీష్ రాజ్యం కంటే హిందూరాజ్యం మేలు కదా,** అని అన్నారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.52)

అష్ఫాక్ అంతటితో ఆగలేదు. ఈ కేసులో, **నేనొక్కడినే ముస్లిం కావటంతో నా బాధ్యత మరింత పెరిగింది. నేను ఏదైనా పొరపాటు చేశానా? అది ప్రధానంగా ముస్లిం మీద మా పఠాన్ జాతి జనుల మీద మాయని మచ్చగా మిగిలి పోతుంది. కనుక నన్ను గౌరవ ప్రదంగా మరణించనివ్వండి** అని కూడా ఆ అధికారితో అన్నారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.53) ఆ సమాధానాలతో బిత్తరపోయిన అధికారి మరోమాట లేకుండా తోకముడిచాడు.





అయినా పోలీసు అధికారులు తమ నక్కజిత్తులను మానలేదు. అష్ఫాఖ్ ను లొంగదీసుకునేందుకు ఆయన న్యాయవాది శ్రీ కృపాశంకర హజేలా ను కూడా ప్రయోగించారు. ఆయన ద్వారా కూడ అష్ఫాఖ్‌కు చెప్పించి చూశారు. ప్రధాన కేసులోని విప్లవకారులకు భయంకర శిక్షలు పడ్డాయి కనుక, ఆ శిక్షలను ఉదాహరిస్తూ, అష్ఫాఖ్‌కు కూడా ఉరిశిక్ష పడొచ్చు కనుక, పోలీసులకు సహకరిస్తే, ఉరి శిక్ష నుండి ఆయనను రక్షించవచ్చని ఖాన్ బహద్దూర్ తస్సద్దిఖ్ హుస్సేన్, అష్ఫాఖ్ న్యాయవాది శ్రీ కృపాశంకర్ హజేలాకు సలహ ఇచ్చాడు. ఆ సలహా న్యాయవాదికి నచ్చింది. అష్ఫాఖుల్లా న్యాయవాదిగా ఆయనను రక్షించటం తన బాధ్యతగా భావించిన శ్రీ కృపాశంకర హజేలా తన వంతు ప్రయత్నం చేశారు.

ప్రధాన కేసులోని తీర్పులో అష్ఫాఖ్ గురించి న్యాయమూర్తి చేసిన ప్రస్తావనలను బట్టి, అష్ఫాఖ్‌కు ఉరిశిక్ష తప్పదని భావించి భయపడిన న్యాయవాది శ్రీ కృపాశంకర్, అష్ఫాఖ్‌ను కనీసం ఉరిశిక్ష నుంచి తప్పించవచ్చన్న అభిప్రాయంతో పోలీసుల ప్రతిపాదనను అష్ఫాఖ్ ముందుంచారు. న్యాయవాది మాటలను పూర్తిగా విన్నాక, అష్ఫాఖ్ నవ్వుతూ, **హజేలా సాబ్, నన్ను ఉరి శిక్ష నుండి తప్పించగలనా? అను భయంతో మీ లాంటి వ్యక్తి కూడా పశ్చాత్తాపం ప్రకటించమని నాకు సలహా ఇస్తారని నేను అనుకోలేదు. అది అసంభవం. నేను చేసింది ఒప్పుకాని, తప్పు కాని నా దేశానికి స్వరాజ్యం సంపాదించాలన్న ప్రగాఢమైన కోరికతో చేసాను. అందువలన పశ్చాత్తాపం చెందాల్సిన అవసరం ఏమీ లేదు. నేను స్వదేశీయుల గృహాలలో దోపిడి చేసే విషయంలో బిచ్‌పూర్ సంఘటన నుండి, శ్రీ రాంప్రసాద్ బిస్మిల్‌తో విభేదిస్తూనే ఉన్నాను. అయితే కాకోరి సంఘటనను ఆ ఘటనలతో జోడించలేం. దీనిని మేం మా లక్ష్య సాధన కోసం ఒక మార్గమని భావిస్తున్నాం. భారత జాతీయ కాంగ్రెస్ ఎలాగైతే లక్ష్యసాధనకు తన మార్గాన్ని నిర్దేశించుకుందో అలాగే మేమూ దేశ స్వాతంత్ర్యం కోసం మా మార్గాన్ని ఏర్పరుచుకున్నాం. ఈ మార్గం కంటకప్రాయమైనప్పటికి, ఈనాడు దేశం కోసం ప్రాణాలు అర్పించాల్సిన పరిస్థితి చాలా ఉంది. ఇక నేరం అంగీకరించటం అంటారా? నా వరకు నేను నేరం అంగీకరించడానికి సిద్ధమే కాదు, అందరి నేరాలను నా నెత్తిన వేసుకోడానికి కూడా సిద్ధం,** (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.85). అని అష్ఫాఖ్ అన్నారు.

ఆ విధంగా 27 సంవత్సరాల యువకుడు అష్ఫాఖ్ చెప్పటంతో శ్రీ కృపా శంకర్‌కు దుఃఖం ఆగలేదు. అష్ఫాఖ్ దేశభక్తిని, విప్లవోద్యమ నిబద్ధతను, సహచరుల పట్ల ఉన్న

గౌరవాభిమానాలను గమనించిన ఆ సీనియర్ న్యాయవాదికి నోట మాట రాలేదు. ఆయన తన మనస్సులోనే ఆ విప్లవకారుడ్ని అభినందిస్తూ, అక్కడి నుండి తప్పుకున్నారు.

ఈ విషయాన్ని అష్ఫాఖ్ తన తల్లికి రాసిన ఒక ఉత్తరంలో ప్రస్తావిస్తూ, **తాను** అప్రూవర్‌గా మారి తన ప్రాణాలను కాపాడుకుని చరిత్రహీనుడ్ని కాదలచుకోలేదని, తాను రానున్న తరాలకు ఆదర్శంగా నిలవాలనుకుంటున్నానని పేర్కొన్నారు. ఈ మేరకు తల్లికి రాసిన లేఖలో, **నేను అప్రూవర్‌గా మారవచ్చు... నేరం కూడా అంగీకరించవచ్చు... అయితే తన కోసం ఇతరులను బలితీసుకునే వ్యక్తి భవిష్యత్తు తరాలకు ఎంతవరకు ఆదర్శం కాగలడా? ఎన్నటికీ కాలేదు,** (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.101) అన్నారు. తన ప్రాణాల రక్షించుకోడానికి తాను అప్రూవర్‌గా మారి ఇతరుల ప్రాణాలను బలిపెట్టదలచుకోలేదని, తన తల్లికి అష్ఫాఖ్ తెలిపారు.

## బిస్మిల్ కోసం ప్రాణ త్యాగానికి సిద్ధం

కాకోరి రైలు దోపిడికి సంబంధించిన ప్రధాన కేసు విచారణ పూర్తయ్యింది. న్యాయస్థానం శిక్షలు ప్రకటించింది. అష్ఫాఖ్, శచీంద్ర బక్షీల మీద నమోదైన అనుబంధ కేసు విచారణ ఆరంభమైంది. ప్రధాన కేసులో అష్ఫాఖ్, బక్షీల పాత్రకు సంబంధించిన అన్ని వివరాలు విస్తారంగా ప్రస్తావనకు రావటంతో, అనుబంధ కేసు విచారణ ఒక తంతుగా ఆరంభమైంది. ప్రముఖ విప్లవకారుడు చంద్రశేఖర ఆజాద్‌ను అరెస్టు చేయలేక పోవటం వలన ఆయన మీద కేసు పెండింగ్ ఉండి పోయింది.

ప్రధాన కేసులో దాదాపు నిందితులందరికి కఠిన శిక్షలను విధించినందున ఆ తీర్పులకు వ్యతిరేకంగా ప్రజలు నిరసన వ్యక్తం చేశారు. సభలు, సమావేశాలు, ఊరేగింపులు నిర్వహించారు. ఉరిశిక్షలను రద్దు చేయాల్సిందిగా కోరుతూ ప్రభుత్వానికి వినతులు వెళ్ళాయి. ప్రజాప్రతినిధులు విజ్ఞప్తులు చేసారు. విజ్ఞప్తులను తిరస్కరించడం జరిగింది. అప్పీళ్ళను త్రోసిపుచ్చారు. విప్లవకారులందరికి శిక్షలు ఖరారయ్యాయి. అప్పీళ్ళ వ్యవహారం అంతా క్రింది స్థాయిలో పూర్తయ్యింది. ప్రీవీకౌన్సిల్‌కు అప్పీలు చేసుకోవడం మాత్రమే చివరకు మిగిలుంది.

ఈ విషయం చర్చించడానికి అష్ఫాఖుల్లా న్యాయవాది, ప్రముఖ ఆర్యసమాజం నాయకుడు శ్రీ కృపాశంకర్ హజేలా జైలుకు వచ్చారు. ఆయనకు అష్ఫాఖ్ అప్పటికే





తయారుచేసి ఉంచిన ఓ వినతి ప(త్రాన్ని చూపారు. ఆ వినతి పత్రంలో పేర్కొన్న అంశాలను చూసి న్యాయవాది కంగారుపడ్డాడు. ఆ విషయాలను ప్రస్తావిస్తూ, అలా రాసావేంటని అష్ఫాఖ్‌ను ప్రశ్నించారు. ఈ వినతి పత్రాన్ని పంపితే మీకు శిక్ష తగ్గటం కాదు కదా, ఇతరులకు విధించిన శిక్షలన్నీ కూడా మీకు చుట్టుకుంటాయని న్యాయవాది అష్ఫాఖ్‌ను కోపగించుకున్నాడు. న్యాయవాది హెచ్చరికలను అష్ఫాఖ్ చిరునవ్వుతో స్వీకరిస్తూ కాసేపు మౌనం వహించారు.

మౌనంగా ఉన్న అష్ఫాఖుల్లాను ఆభ్యర్థన పత్రం అలా ఎందుకు తయారు చేశారు?, అంటూ ఆ తయారిలో గల ఉద్దేశ్యం ఏంటని గుచ్చి గుచ్చి ప్రశ్నించాక అష్ఫాఖ్ న్యాయవాదికి సమాధానమిస్తూ, **నిజం ఏమిటంటే బిస్మిల్ కోరిక మేరకు ఇలా రాసాను. బిస్మిల్ నాతో కలిసినప్పుడు ఈ విధంగా రాస్తే తనకు ఉరిశిక్ష తప్పి, జీవిత ఖైదు పడగలదని అన్నాడు. ఆయనకు మేలు జరుగుతుంది కనుక ఆయన కోరినట్టు చేస్తానని వాగ్దానం చేసాను. ఆయన క్షేమం కోరుతూ అభ్యర్థన పత్రం అలా తయారు చేశాను,** (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.86) అని అష్ఫాఖ్ చెప్పారు.

ఈ వివరణ విన్న తరువాత ఆ అప్పీల్‌ను ఎవ్వరికి పంపవద్దని, ఆలా పంపితే ప్రాణం మీదకు వస్తుందని కృపాశంకర్ అష్ఫాఖుల్లాను హెచ్చరించాడు. మిత్రుడి కోసం బలికావడానికి సిద్ధపడిన అష్ఫాఖుల్లా ఖాన్ తన న్యాయవాది కృపాశంకర్ హెచ్చరికలను ఖాతరు చేయలేదు. ఆయన తయారు చేసిన వినతి పత్రాన్ని ఎటువంటి మార్పులు చేయకుండా యధావిధిగా ప్రీవీ కౌన్సిల్‌కు పంపివేశారు.

## సమర్ధుడైన నేత కోసం నేరం ఒప్పుకోలు

పండిత బిస్మిల్ వ్యక్తిగతంగా అష్ఫాఖుల్లా ఖాన్‌ను తమ్ముడిలా, ప్రధాన అనుచరుడిగా చూసుకున్నారు. కాకోరి కుట్ర కేసును విచారించిన బ్రిటీష్ న్యాయాధికారి కూడ అష్ఫాఖ్‌ను శ్రీ బిస్మిల్ ప్రధాన సహచరుడిగా పేర్కొన్నారు. హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్ నిర్వహించిన పలు యాక్షన్స్‌లో శ్రీ బిస్మిల్‌తోపాటుగా బాధ్యతలను నిర్వహించిన అష్ఫాఖుల్లా, న్యాయస్థానం విధించిన శిక్షలలో కూడా సమానత్వం అనుభవించారు. శ్రీ బిస్మిల్ మాటను అష్ఫాఖుల్లా ఎన్నడూ జవదాటలేదు. చివరకు శ్రీ బిస్మిల్ ప్రాణానికి తన ప్రాణం అడ్డువేయడానికి కూడా ఆయన వెనుకాడలేదు. కాకోరి కేసులో శిక్షలు

పద్దాక, ప్రీవీకౌన్సిల్‌కు అప్పీలు చేసుకోవటం ఆయనకు ఇష్టం లేకున్నా శ్రీ బిస్మిల్ కోరిక మేరకు సరేనన్నారు.

అష్ఫాఖ్ అంతటితో సరిపెట్టుకోలేదు. కాకోరి సంఘటనకు తనను తాను ప్రధాన బాధ్యుడిగా పేర్కొంటూ, నేరభారాన్ని,భాధ్యతను పూర్తిగా తాను స్వీకరిస్తూ, స్వయంగా న్యాయస్థానానికి అప్పీల్ దరఖాస్తును పంపారు. ఆ దరఖాస్తుకు ఆయన న్యాయవాది స్వయంగా అభ్యంతరం పెట్టారు. ఆ సందర్భంగా, మీరు మీరు చేయని నేరాలను ఎందుకు అంగీకరిస్తున్నారు? అని ప్రశ్నించిన న్యాయవాది శ్రీ హజేలాకు నచ్చ చెబుతూ, **నేను ఎల్లప్పుడు సిపాయిని మాత్రమే. రాంప్రసాద్ మా నాయకుడు. ఆయన నిష్టగల దేశభక్తుడు. మంచి తెలివితేటలు గల వ్యక్తి. నా ప్రాణాలు అడ్డువేసి ఆయనను రక్షించుకో గలిగితే అది మా పార్టీకి, మా లక్ష్యాల సాధనకు ఎంతో మంచిదౌతుంది. నేను సిపాయిని మాత్రమే. ఆయన ఆలోచనలు తీరుతెన్నుల విషయంలో నేను సరితూగలేను. అందువలన ఆయనను రక్షించుకోవాల్సి ఉంది**, అని అష్ఫాఖుల్లా అన్నారు.(Sudhir Vidyardhi : Page.86)

చివరకు ఆ అభ్యర్థన పత్రం వలన శిక్ష మాఫి సంగతి ఎలాగున్నా, శిక్ష మరింత బలపడుతుందని న్యాయవాది చెప్పినప్పటికీ వినకుండా, ఆ దరఖాస్తు పత్రాన్ని ఉన్నత న్యాయస్థానానికి పంపుకున్నారు. ఓ సమర్ధుడైన నాయకుడ్ని రక్షించుకుంటే ఉద్యమం సజీవంగాఉంటుందన్న నమ్మకంతో, ఆ నేతకు బదులు తాను శిక్షలకు సిద్దపడిన అష్ఫాక్‌కు విప్లవోద్యమం పట్ల ఉన్న నిబద్దత, త్యాగశీలత పండిత బిస్మిల్ పట్ల ఉన్న గౌరవం ఈ చర్య ద్వారా బహిర్గతమయ్యాయి.

## క్షమాభిక్ష యాచనకు వ్యతిరేకి

ప్రజల, ప్రజాప్రతినిధుల విజ్ఞప్తులు అన్ని స్థాయిలలో తిరస్కరించబడ్డాక, చివరకు క్షమాభిక్ష పత్రాన్ని పంపేందుకు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. ఉరిశిక్షలు పడిన వారంతా క్షమాభిక్ష కోరుతూ వినతి పత్రాలు పంపుతున్నారు. అష్ఫాఖ్ మాత్రం క్షమాభిక్ష కోరడానికి అంగీకరించలేదు. దేవుని మీద అపార విశ్వాసం గల అష్ఫాఖ్ ప్రతిదీ దేవుని ఇచ్ఛానుసారంగా జరుగుతుందని, దేవుడు తన పాత్రను ముగించదలిచాడని, ఆ కారణంగానే తనకు ఉరిశిక్ష పడిందని, అందువలన ఆ శిక్షను స్వీకరించడానికి తాను సిద్ధంగా ఉన్నానని బంధుమిత్రులకు రాసిన లేఖలో వివరంగా పేర్కొన్నారు.








మాతృదేశం కోసం ప్రాణాలర్పించటం అదృష్టంగా భావిస్తున్నానని, ఆ అవకాశం తనకు దక్కినందుకు దేవునికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నానని సహచరులతో అన్నారు. ఉరిశిక్షను దైవప్రసాదితంగా అష్ఫాఖుల్లా ఖాన్ భావించినందున, చక్రవర్తికి క్షమాభిక్ష పెట్టుకోడానికిససేమిరా అంగీకరించ లేదు. మిత్రుడు బిస్మిల్ ఊరుకోలేదు. అష్ఫాఖ్ మీద ఒత్తిడి తెచ్చాడు. చివరకు అష్ఫాఖ్ అయిష్టంగానే క్షమాభిక్ష పత్రం పంపారు. ఈ విధంగా అష్ఫాఖ్ మీద ఒత్తిడి తెచ్చి, ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా, ఆయన చేత క్షమాబిక్ష అభ్యర్ధన పత్రం పంపించినందుకు, ఆ తరువాత బిస్మిల్ తన పశ్చాత్తాపం ప్రకటించారు.

ఈ విషయాన్ని తాను రాసుకున్న ఆత్మకథలో బిస్మిల్ ప్రస్తావిస్తూ, **అష్ఫాఖుల్లా ఖానైతే బ్రిటీష్ ప్రభుత్వాన్ని క్షమాభిక్ష యాచించేందుకు సమ్మతించలేదు. దయామయుడైన ఆ దేవుని తప్పించి మరో వ్యక్తినెవరినీ క్షమాభిక్ష కోరరాదని ఆయన అచంచల విశ్వాసం. కానీ నేను మరీ పట్టుబట్టడంతో ఆయన కూడా క్షమాభిక్ష కోరాడు. నా పవిత్ర ప్రేమ ప్రసాదించిన అధికారాల్ని వినియోగించి నేను అష్ఫాఖుల్లా ఖాన్‌ను తన దృఢనిశ్చయం నుండి విచలితుడయ్యేలా చేశాను. గనుక దీని దోషమంతా నాదే... గోరక్‌పూర్ జైలు నుండి అష్ఫాఖుల్లా ఖాన్‌కు నేనొక లేఖ రాసి నన్ను క్షమించాల్సిందిగా కోరాను,** అన్నాడు. (బిస్మిల్ ఆత్మకథ : పేజి. 137)

బిస్మిల్ చివరి సందేశాన్ని విద్రోహి కలం పేరుతో సర్దార్ భగత్‌సింగ్ 1928 నాటి **కీర్తి** పత్రికలో ఇదే విషయాన్ని ప్రస్తావిస్తూ, **నేను చెబుతున్నట్టుగానే, అష్ఫాఖుల్లా ఆలోచనలూ ఉన్నాయి. అప్పీలు రాస్తున్నప్పుడు లక్నో జైలులో నేను అతనితో మాట్లాడాను. ప్రభుత్వానికి దయాభిక్ష పత్రం సమర్పించటం తనకు ఎంత మాత్రమూ యిష్టం లేదు. నేను బలవంతం చేయటం వల్ల, నా మాటను కొట్టెయ్యలేక చివరికి అష్ఫాఖుల్లా అంగీకరించాడు**, (జ్ఞాపకం చేసుకోండి ఎప్పుడైనా : పేజి.28 మరియు 40) అని బిస్మిల్ చెప్పినట్టుగా రాసారు.

ప్రజల వేడుకోళ్ళు ప్రభుత్వాన్ని కదిలించలేకపోయాయి. ప్రజా నాయకుల వినతులు బుట్టదాఖలయ్యాయి. ఆ క్షమాభిక్ష విజ్ఞప్తులు తిరస్కరించబడ్డాయి. చివరకు ప్రధాన కేసులోగాని, అనుబంధ కేసులోగాని విచారణ ఎదుర్కొన్న కాకోరి యోధులలో నలుగురికి ఉరిశిక్షలు ఖరారయ్యాయి. అష్ఫాఖుల్లా ఖాన్‌ను 1927 డిసెంబరు 19వ తేదీన ఫైజాబాద్ జైలులో ఉరితీయాలని కోర్టు ఆదేశించింది. ఆ ఆదేశాల ప్రకారంగా అష్ఫాఖుల్లా ఖాన్‌ను లక్నో కారాగారం నుండి ఫైజాబాద్ జైలుకు తరలించారు.

## మృత్యువుకు వెరవని ధీరుడు

మాతృదేశం కోసం ప్రాణాలర్పించేందుకు సంసిద్ధుడైన అష్ఫాఖ్ ఏనాడు మృత్యువుకు భయపడలేదు. చిన్న వయస్సులోనే మాతృదేశ సేవకు తనను తాను అంకితం చేసుకున్న ఆయన తనను భారతమాత సేవకునిగా చెప్పుకున్నారు. తన ప్రాణాలు భారతమాతకు అర్పితమని కూడా ఆయన మిత్రులకు, సన్నిహితులకు రాసుకున్న లేఖలలో పేర్కొన్నారు. అనునిత్యం చస్తూ పిరికితనంతో బ్రతకడం ఆయనకు ఇష్టం లేదు. ఈ భావాన్ని ఆయన రాసిన కవితలో వ్యక్తం చేసారు. చివరికి ఉరివేదిక మీద కూడా తన నిర్భీతిని, భావోద్వేగాలను ఉర్దూ కవితల ద్వారా వెల్లడించారు. ఆయన బంధుమిత్రులకు రాసిన లేఖలలో భావోద్వేగాలను చక్కని ఉర్దూ కవితల ద్వారా అష్ఫాఖ్ వెల్లడించారు. బంధుమిత్రులకు రాసిన లేఖలలో, వారితో జరిగిన సంభాషణలలో తనకు మరణ భయం ఏమాత్రం లేదని పేర్కొన్నారు. మాతృదేశం కోసం మృత్యుమాలను ధరించేందుకు తాను సిద్దంగా ఉన్నాని, అంతటి మహద్భాగ్యం తనకు దక్కినందుకు గర్వపడుతున్నానని అష్ఫాఖుల్లా ఖాన్ పలు లేఖలలో పేర్కొన్నారు.

ఉరిశిక్ష అమలు కోసం ఎదురుచూస్తూ ఫైజాబాదు జైలులో ఉన్న సమయంలో ఆయన తల్లికి రాసిన లేఖలో మరణమంటే ఖాతరు చేయనని నిర్భయాన్ని వెల్లడించారు.





మాతృభూమి కోసం మరణించే మహత్తర అవకాశం లభించినందున ప్రతిఒక్కరూ సంతోషించాలన్నారు. ఓ లక్ష్యం కోసం మరణించే అదృష్టం పొందిన కొడును చూసి ప్రతి తల్లీ గర్వించాలన్నారు. ఈ మేరకు ఆయన తన సోదరులు మహమ్మద్ రియాసతుల్లా, తల్లి మజహరున్నీసాలకు రాసిన లేఖలలో ఆయనలోని నిర్భయత్వం వెల్లడవుతుంది.

ఉత్తర ప్రదేశ్‌లోని ఫైజాబాదు జైలు గోడల మధ్య నుండి ఆయన తన తల్లికి రాసిన ఒక లేఖలో, **అమ్మా..నీ బిడ్డడు వీరోచితంగా మరణాన్ని స్వీకరిస్తున్నందుకు నీవు గర్వించాలి. మృత్యువుతో పోరాడాల్సి వస్తే నీవు కూడా అత్యంత ధైర్యాన్ని ప్రదర్శించి, ఓ యోధుని తల్లిగా నిన్ను నీవు రుజువు చేసుకోవాలి...భయం కలిగించే మాటలను కూడా అతి తేలిగ్గా తీసుకుంటున్నానంటే అదంతా మీ ఉగ్గుపాల మహిమ...మీరు వదినతో వచ్చేట్టయితే గతంలో వచ్చినట్టు ధైర్యశాలిగా రాగలవు. నన్నూ ధైర్యశాలిని చేయాలి,** అని రాశారు. (Sudhir Vidyardhi : Page. 86)

అమ్మా నీవు వీరమాతవు. వీరమాతలు దుఃఖించరాదని తల్లికి ధైర్యం చెప్పారు. మరణం ఎవరికైనా తప్పదు. అయితే అటువంటి మరణం ఒక సదాశయాన్ని సాధించే క్రమంలో లభిస్తే సంతోషించాలన్నారు. నా దేశం కోసం నేను మరణించటం గర్వించదగిన విషయం. ఎవరికైనా ఇంతకంటే గొప్ప వరం ఏముంటుంది? నా వంశంలో నా తల్లి కంటే గొప్పవారు ఎవరుంటారు? అంటూ తల్లిని అష్ఫాఖ్ ఊరడిస్తారు. అంతేకాదు ఆయన పలువురికి రాసిన లేఖలలో, నేను వీరగతిని పొదుతున్నాను. మాతృదేశం కోసం బలయ్యేవారు అదృష్టవంతులు. అంతకంటే అదృష్టవంతులు ఎవరుంటారు?.... మాతృదేశాన్ని ప్రేమిస్తున్నందుకు నాకు మరణశిక్ష విధించారు. అందుకు నేను గర్విస్తున్నాను, అని పేర్కొంటూ, మృత్యువుకు ఏ మాత్రంవెరవని ధీరోదాత్తుడుగా అష్ఫాఖ్ దర్శనమిస్తారు.

అష్ఫాఖుల్లా ఖాన్ న్యాయవాది శ్రీ హజేలా, ఆయన సన్నిహితులు ఆయన ప్రాణాలను కాపాడుకునేందుకు ప్రభుత్వంతో సహకరించమన్నప్పుడు, ఆ సలహాలను తిరస్కరిస్తూ, తన తల్లికి రాసిన లేఖలో, **నేను నా ప్రాణాలు కాపాడుకునేందుకు, ఇతరులను ఈ కేసులలో ఇరికించేందుకు అప్రూవర్ కాగలను. ఈ మేరకు ప్రభుత్వానికి సహరించ గలను. తన జిందగీ కోసం ఇతరుల బ్రతుకులను ఇక్కట్ల పరం చేయగలంతటి అత్యంత నీచమైన చర్యలకు పాల్పడిన వ్యక్తి భవిష్యత్తు తరాలకు ఏవిధంగా ఆదర్శనీయుడు కాగలడా? కాడు ఎప్పుడు కాలేడు... నాకు గర్వంగా ఉంది రానున్న తరాలు నన్ను పిరికిపంద అనవు. నీచుడు అని నన్ను అవును....నిశ్చయంగా అనవు. నన్ను**

**సత్యసంధుడు, ధైర్యవంతుడు అంటారు,** అని రాశారు. ( Sudhir Vidyardhi : Page.101)

ఈ కాకోరి కేసులో ఆయన సహచరుడు శ్రీ శచీంద్రనాథ్ బక్షి సోదరి, విప్లవకారిణి నళినికి 1927 డిసెంబరు 16వ తేదిన రాసిన లేఖలో, **.. నేను మరణించపోతున్నాను. అంతకన్నా ఇలా అంటే బాగుంటుందేమో. వాస్తవానికి నేను అమరత్వం పొందబోతున్నాను... వచ్చే సోమవారం నా జీవితానికి చివరి రోజు కాబోతోంది....నేను వీర మరణం పొందబోతున్నాను,** (ప్రజాసాహితి : పేజి 54-55) అని సంతోషాన్ని వ్యక్తం చేశారు.

ఈ విధంగా ఓ మహత్తర లక్ష్యం కోసం ఉరిశిక్షను స్వీకరించటం మహాద్భాగ్యంగా భావించిన అష్ఫాఖ్ మాతృదేశం కోసం మరణ వేదికనెక్కటం గర్వించదగిన అవకాశంగా భావించి, ఆ క్రమంలో తన ప్రాణాలను తృణప్రాయంగా భావించి ఉరిశిక్ష అమలు కోసం ఎదురు చూడసాగారు.

## ఉరిశిక్ష అమలుకు ఎదురుచూపు

ఉరిశిక్ష ఖరారయ్యాక ఆ శిక్ష అమలు కోసం అష్ఫాఖ్ ఎదురుతెన్నులు చూడ సాడగారు. ఉరిశిక్ష తనకు లభించిన మహత్తర అవకాశంగా భావించినందున, ఆ శిక్షతో ప్రయోజనం పొందాలని ఆయన భావించారు. తనను త్వరితంగా ఆంగ్లేయ ప్రభుత్వం ఉరి తీయాలని, తద్వారా ప్రజల గుండెలు మండాలని, మండిన గుండెల నుండి ఎగప్రాకిన బడబాగ్నులలో బ్రిటీషర్లు మాడి మసైపోవాలని ఆయన కోరుకున్నారు. ఆయన ఉరిశిక్షను చాలా చిన్న విషయంగా భావించారు. ఆయనను చూడడానికి వచ్చిన బంధు మిత్రులతో, ఉరి కొయ్య మీద ఉయ్యాల ఊగే సుందర స్వప్నాని అనునిత్యం దర్శిస్తున్నాని అన్నారు.

అష్ఫాఖ్‌ను చివరిసారిగా చూసేందుకు న్యాయవాది శ్రీ కృపాశంకర్, హజేలా, అష్ఫాఖ్ అన్నదమ్ములు, అన్న కుమారులు డిసెంబరు 17 న జైలుకు వచ్చారు. అప్పుడే స్నానం చేసి శుభ్రమై బట్టలు ధరించిన ఆయన జైలు సెల్‌లోకి వెడుతూ, చిరునవ్వుతో అత్మీయులకు అభివాదం చేశారు. అప్యాయంగా బంధుగణాన్ని పలకరించారు. ఉరిశిక్షకు ఎదురు చూస్తున్న ఆయన ఏమీ జరనట్టు వ్యవహరించారు. ఆయన పలకరింపుతో గుండెచెదరిన ఆయన సోదరులు, ఆ సోదరుల కుమారులు గుండెలు పగిలేట్టుగా విలపించసాగారు. ఆ దృశ్యం అష్ఫాఖ్‌కు చిరాకు కలిగించింది.





ఆ సందర్భంగా, అష్ఫాఖ్ న్యాయవాది శ్రీ కృపాశంకర్ హజేలాను దగ్గరకు పిలిచి, **హజేలా సాబ్, వీళ్ళందర్ని మీ వెంట ఎందుకు తీసుకొచ్చారు? ఇది రోదించాల్సిన సమయమా? సంతోషించాల్సిన సమయమా?....నా భారతదేశపు రాజ్యాధికారాన్ని ఆంగ్లేయుల నుండి లాక్కోడానికి నేను కుట్రపన్నానని నా మీద విచారణ సాగింది. ఈ లక్ష్యం ప్రాణాలను పణంగా పెట్టి సాధించాల్సింది కాదా? అటువంటప్పుడు ఈ ఏడ్పులు పెడబొబ్బలేంటి? వీరి తమ్ముడు లేక చిన్నాన్న దేశం కోసం తన ప్రాణాలను పణంగా పెట్టి ఉరివేదిక నెక్కనున్నందుకు వీళ్లంతా సంతోషించాలి. హిందూ సమాజం నుండి శ్రీ ఖుదీరాం, శ్రీ కన్హయ్యలాల్ లాంటి మహనీయులు మాతృదేశం కోసం తన ప్రాణాలను బలిపెట్టిన విషయం వీళ్లకు తెలపండి. ముస్లిం సమాజం నుండి, విప్లవకారుల మీద మోపిన ఇటువంటి కుట్ర కేసులో ఉరివేదిక ఎక్కి ప్రాణాలను అర్పించనున్న తొలి ముస్లింని నేనేనని గర్విస్తున్నానని,** అష్ఫాఖ్ అన్నారు. ( Sudhir Vidyardhi : Page.88)

ఈ మాటలు వింటూనే న్యాయవాది శ్రీ హజాలే విచలితుడయ్యారు. ఉబికి వస్తున్న దుఖాన్ని ఆణిచి పెట్టుకుంటూ, మీ చివరి కోరిక ఏంటీ ? అని అష్ఫాఖ్‌ను ఆయన అడిగారు. ఆ మాటకు నవ్వుతూ, **ఆ నాకొక చివరి కోరిక ఉంది. మీరు పూర్తి చేయగలిగితే...ఎల్లుండి నన్ను ఉరివేదిక నెక్కిస్తారు. మీరు చూస్తు ఉండిపొండి నేను ఏ విధంగా ఉరిని స్వీకరిస్తానో**, అన్నారు. ఆ పని మాత్రం నేను చేయలేనంటూ న్యాయవాది హజేలా కంటతడి పెట్టగా, ఆయన బంధువులకు దు:ఖం కట్టలు తెంచుకుంది.

ప్రముఖ రచయిత శ్రీ శాంతిమోయ్ రే తన పుస్తకం **ఫ్రీడమ్ మూవ్‌మెంట్ అండ్ ఇండియన్ ముస్లిమ్స్** లో ఆ రోజున అష్ఫాఖుల్లా ఖాన్ నోట వెలువడిన మాటలను ఆంగ్లంలో ఈ విధంగా గ్రంథస్థం చేశారు.

"...If I am not allowed to observe the last ceremony of the noblest ordeal with all dignity and steadiness then the sanctity of the occasion will be tarnished. Today I feel myself worthy of honour with the hope that a sacred and great responsibility for the liberation of motherland has been entrusted to me. You should feel happy and proud that one of yours is fortunate enough to offer his life. You must remember that the Hindu community has dedicated great souls like Khudiram and Kanailal. To me this is a good fortune that belonging to Muslim Community I have acquired the privilege of following the footsteps of those great martyrs..." (Freedom Movement and Indian Muslims, Santimoy Ray, PPH, New Delhi, 1983, Page. 43)

అష్ఫాఖుల్లా ఖాన్ ఆరోజు చెప్పిన మాటలు ఆయన మహోన్నత త్యాగనిరతికి, మాతృభూమి పట్ల ఆయనకు గల అపార ప్రేమాభిమానాలకు, లక్ష్యం పట్ల ఉన్న నిబద్ధతకు నిర్భీతికి, లక్ష్యం కోసం ప్రాణాలను తృణప్రాయంగా త్యాగం చేయడానికి సిద్ధమైన తీరుకు, ఆయనలోని ధైర్యసాహసాలకు సజీవ చిహ్నాలుగా నిలుస్తాయి.

ఉరిశిక్ష అమలుకు ముందురోజున, అంటే 1927 డిసెంబరు 18వ తేదీన, జైలులో అష్ఫాఖ్‌ను చూసిన సర్దార్ భగత్‌సింగ్ ఆరోజున అష్ఫాఖ్ ఎలా ఉన్నాడన్న విషయాన్ని, ఈ స్వచ్ఛంద కవి. **ఆశ్చర్యంలో ముంచే ఉల్లాసంతో ఉరికంబమెక్కాడు. ఎంతో అందగాడు, మంచి ఒడ్డుపొడుగూ ఉన్న యువకుడు. చాలా బలిష్టంగా ఉండేవాడు. జైలులో కొద్దిగా చిక్కాడు. చిక్కిపోడానికి కారణం దిగులు కాదని, దేవుని స్మరించుకుంటూ శాంతిగా ఉండడానికి ఆహారం చాలా తక్కువ తీసుకోవడమే కారణమని జైలులో కలిసినప్పుడు చెప్పాడు. ఉరితీయడానికి ఒకరోజు ముందు ఆయనను కలిశాను. ఆయన బాగా ముస్తాబు అయి ఉన్నాడు. పాపిటతీసి దువ్విన పొడవాటి వెంట్రుకలు ఎంతో అందంగా ఉన్నాయి. ఎంతో హుషారుగా నవ్వుతూ, తుళ్ళుతూ మాట్లాడాడు. ' రేపు నా పెళ్ళి '** అని అన్నాడని భగత్‌సింగ్ తెలిపారు. (జ్ఞాపకం చేసుకోండి..: పేజి 40) ఆ పెళ్ళిరోజు రానే వచ్చింది. **'.. నా పెళ్ళి చేయాలని మా వాళ్లెంతో ప్రయత్నించారు. నాకు నచ్చిన వధువు దొరకక చేసుకోలేదు. ఇన్నాళ్ళకు ఇదిగో నాకు నచ్చిన వధువు దొరికింది,** అంటూ అష్ఫాక్ ఉరిశిక్షను వధువుతో పోల్చారు. (బిస్మిల్ ఆత్మకథ: పేజి 152).

అష్ఫాఖుల్లా మృత్యువు సముఖంలో ప్రదర్శించిన ధైర్యసాహసాలను శ్రీ రాంప్రసాద్ బిస్మిల్ తన ఆత్మకథలో ప్రశంసిస్తూ, **నాకిప్పుడు కొంతైనా తృప్తి ఉందంటే ఆదంతా ఈ ప్రపంచంలో నా పేరు ప్రతిష్టల్ని నీవు సముజ్వలం గావించావనే. ' అష్ఫాఖుల్లా విప్లవోద్యమంలో పాల్గొన్నాడు. తోబుట్టువులు, బంధుమిత్రులు ఎంతగా వారించినా అతడు ఏ మాత్రం లెక్క చేయలేదు. ఆరెస్టయిన పిదప కూడా తన భావాలను వదులుకోకుండా సుదృఢంగా నిలిచారు.' అనే సంగతి భారతదేశ చరిత్రలో ఎంతో ఉల్లేఖనీయమై పోయింది.**, అని పేర్కొన్నారు. (పేజి : 123).

ఈ సందర్భంగా బిస్మిల్ అల్లిన కవిత ఈ విధంగా సాగుతుంది. **'మరణిస్తారు అన్యాయంగా బిస్మిల్, రోషన్, లాహిరి, అష్ఫాఖ్ – నేల యీనినట్టు పుట్టుకొస్తారు– మా నెత్తుటి ధారలనుండి వందలాది యోధులు'** (మరతేఁ 'బిస్మిల్ ', 'రోషన్', 'లహరీ', 'అష్ఫాఖ్' అత్యాచార్ సే–హోంగే పైదా సైకడోఁ ఉన్‌కే రుధిర్ కి ధార్ సే)





## ప్రజా చైతన్యం మాత్రమే సమస్యలకు పరిష్కారం

మాతృదేశం కోసం ప్రాణత్యాగానికి సిద్ధపడిన అష్ఫాఖ్ తన అనుభవాల ఆధారంగా యావత్తు ప్రజలను చైతన్యవంతులను చేసి, భారతదేశం మొత్తం మీద విప్లవ జ్వాలలను ప్రజ్వరిల్ల చేయాలనుకున్నారు. ఈ విషయాలను జైలు నుంచి రాసిన చివరి లేఖలో ఈ విధంగా పేర్కొన్నారు.

**భారత రంగస్థలంపైన మా పాత్రను మేము నిర్వహించాము. మేము తప్పులు కాని ఒప్పులు కానీ ఏమి చేసినా స్వాతంత్ర్యం సంపాదించాలనే భావనతో ప్రేరితులమయ్యే చేశాం. మా అయిన వాళ్ళు (కాంగ్రెస్ నేతలు) మమ్మల్ని పొగిడినా, నిందించినా, ఏదేమైనా మా శతృవులకు కూడా మా ధైర్యసాహసాలను పొగడక తప్పలేదు. మేము దేశంలో భయోత్పాతాలు సృష్టిస్తున్నామని కొందరు అంటున్నారు. అది సరికాదు. ఇన్ని రోజులుగా కేసు నడుస్తూ ఉంది. మాలో చాలా మంది ఎంతో కాలం నిర్భంధంలో లేరు. ఇప్పుడు కూడా కొందరు బయట ఉన్నారు. అయినా మేము కాని, మా సహచరులు కాని మాకు కీడు చేసిన వారెవరిపైనా తుపాకి పేల్చలేదు. మా ఉద్దేశ్యం అది కాదు. మేము స్వాతంత్ర్యం సంపాదించేందుకు దేశం మొత్తంలో విప్లవం తీసుకురావాలని అనుకున్నాము.**

మా కేసు విచారించిన జడ్జీలు మమ్మల్ని క్రూరులు, బర్బరులు, మానవత్వంపై కళంకం వంటి వారు అని ఎన్నో విశేషణాలతో ప్రస్తావించారు. మన పరిపాలకుల **జాతివాడే అయిన జనరల్ డయ్యర్ నిరాయుధులైన పిల్లలు, ముసలివాళ్ళు, స్త్రీపురుషులు అందరి మీద తుపాకి గుండ్ల వర్షం కురిపించాడు. న్యాయం యొక్క గుత్తదారులు తమ ఈ ఆత్మీయుడిని ఏ విశేషణాలతో సంబోధించారు? అలాంటప్పుడు మా పట్లనే ఇలా పక్షపాతంతో వ్యవహరించడం ఎందుకు?**, అని స్పష్టంగా ప్రభుత్వాన్ని, న్యాయమూర్తులను ప్రశ్నించారు. (జ్ఞాపకం చేసుకోండి.. : పేజి 41)

అష్ఫాఖ్ ప్రకటించిన అభిప్రాయాన్నే బిస్మిల్ కూడా తన ఆత్మకథ చివర్లో, **భారత ప్రజల్లో అధిక సంఖ్యాకులు మంచి విద్యావంతులు కానంతవరకు ఉచితానుచితాలేమిటో వాళ్ళకు బోధపడడం జరగనంతవరకు, మీరు పొరబాటున కూడా ఏ విధమైన విప్లవకర కుట్రలలో పాల్గొనకండి. దేశసేవ చేయాలనే కోరిక ఉంటే బహిరంగ ఉద్యమాల ద్వారా యధాశక్తి పనిచేయండి. లేని పక్షంలో మీ బలిదానాలు నిరుపయోగమవుతాయి. ఇతర విధాలుగానైతే యింతకంటే హెచ్చుగా దేశసేవ చేయవచ్చు. అందువల్ల ఉపయోగం**

**కూడా అధికంగా వుంటుంది. పరిస్థితులు అనుకూలంగా వుండకపోవడం వల్ల యిటువంటి విప్లవకర ఉద్యమాలలో పడే శ్రమంతా తరచూ వృధాగా పోతూంటుంది.**

**మీరెవరి కోసం పాటుపడుతున్నారో వాళ్ళే మిమ్మల్ని నానా మాటలంటారు. చివరికి మనస్సు లోపలే కుమిలి ప్రాణత్యాగం చేయాల్సి వస్తుంది..ఏది చేసినా అంతా కలసి చేయండి. చేసేదంతా దేశ క్షేమం కోసమే చేయండి. దీని వల్ల అందరికి మేలు కలుగుతుందనే నేను దేశ ప్రజలకు విన్నవించుకుని వారికి చివరగా సవినయంగా కోరు కునేది.**, అని శ్రీ బిస్మిల్ తన అభిప్రాయాన్ని చాలా విస్పష్టంగా ప్రకటించారు. (బిస్మిల్ ఆత్మకథ : 139)

ప్రభుత్వ ఖజానాను దోచుకోవాలని విప్లవ సహచరులు, నిర్ణయించినప్పుడు అష్ఫాఖుల్లా ఆ ప్రతిపాదనను వ్యతిరేకించారు. ఈ యాక్షన్ వలన విప్లవోద్యమానికి తీరని నష్టం జరగగలదని హెచ్చరించారు. తొలుత మనం ప్రజలను పెద్ద సంఖ్యలో భాగస్వాములను చేసి విప్లవోద్యమాన్ని బలోపేతం చేద్దామని ఆయన సూచించారు. ప్రజల భాగస్వామ్యం లేకుండా, పదిమంది సాయుధులై పోరాటాలు చేసినంత మాత్రాన ఫలితం ఉండదని ఆయన చేసిన హెచ్చరికను ఎవ్వరూ ఖాతరుచేయలేదు. చివరకు ఈ చర్య ఫలితంగానే ప్రభుత్వం విరుచుకుపడి విప్లవకారులను తుదముట్టించి. విప్లవోద్యమానికి తీరని నష్టం కలిగించింది.

## షహీద్-యే-ఆజం అష్ఫాఖ్

అష్ఫాఖ్ ఎదురు చూస్తున్న 1927 డిసెంబరు 19వ తేదీ వచ్చేసింది. ఆయన ఆశించిన **పెళ్ళి రోజు** రానే వచ్చింది. ఆ రోజు కూడా ఎప్పటిలాగే ప్రాతఃకాలాన ఆయన నిద్రలేచారు. స్నానపానాదులు ముగించారు. శుభ్రమైన బట్టలు ధరించారు. ఫజర్ నమాజ్ అదా చేశారు. ప్రశాంతంగా ఖురాన్ గ్రంథ పఠనంలో మునిగిపోయారు. మృత్యువును ఆహ్వానిస్తూ మాతృభూమి విముక్తి పోరాట యజ్ఞంలో తానొక సమిధ కానున్నందున ఎంతో ఆనందిస్తూ, జైలు అధికారుల రాక కోసం ఎదురుచూడసాగారు.

ఉరిశిక్ష ఏర్పాట్లు పూర్తి చేసిన జైలు అధికారులు అష్ఫాఖ్ సెల్ వద్దకు వచ్చారు. ఆ అధికారులను చిరునవ్వుతో పలకరిస్తూ ఏర్పాట్లు పూర్తయ్యాయా? అన్నారు. ఆ ప్రశ్నకు అధికారులు చలించిపోయారు. మా తప్పులుంటే మన్నించండి ఆని అధికారులు విజ్ఞప్తి చేశారు. ప్రభుత్వాధికారులుగా, ఉద్యోగులుగా మీరు చేయాల్సింది మీరు చేశారు.





మీ తప్పు ఏముందని ఆయన నవ్వుతూ అన్నారు. అష్ఫాఖ్ నోట వెంట ఆ మాటలు వెలువడగానే, అధికారుల కంట కన్నీరుబికింది. అష్ఫాఖ్ ఉన్న పళంగా లేచి నిలబడ్డారు. నేను తయారుగా ఉన్నాను అంటూ ఖురాన్ గ్రంథాన్ని భుజానికి వేలాడదీసుకున్నారు. అధికారులు వెంట రాగా **లబ్బైక్** పలుకుతూ ఉరి వేదిక వద్దకు బయలుదేరారు.

ఆ సమయంలో అష్ఫాఖుల్లా ఖాన్ ఎలా ఉన్నారన్న విషయాన్ని సర్దార్ భగత్‌సింగ్ వివరిస్తూ, ..**"కురానె షరీఫ్ కట్టి ఉంచిన చిన్న సంచిని వేలాడదీసుకుని హాజీలాగా పారాయణం చేస్తూ ఎంతో ధైర్యంగా ముందుకు నడిచాడు. ముందుకు నడిచి ఉరి కంబంపైన తాడును ముద్దుపెట్టుకున్నాడు. ఉరి వేదికవద్ద తనకు ఎదురుగా ఉన్న వ్యక్తులను ఉద్దేశించి, నేను ఎవరి రక్తంతోనూ నా చేతులు కళంకితం చేసుకోలేదు. నా విచారణ దేవుని ముందు జరుగుతుంది. నాపై మోపిన నేరాలన్నీ అబద్ధాలు, అని అష్ఫాఖుల్లా ఖాన్ అన్నారు"** అని పేర్కొన్నారు. (జ్ఞాపకం చేసుకోండి..: పేజి. 40-41)

ఉరిశిక్ష అమలయ్యేంత వరకు ఆయన చిరునవ్వుతో ఉన్నారు. మాతృదేశాన్ని బానిసబంధనాల నుండి విముక్తం చేయాలన్న ఆయన దృఢసంకల్పంలో చివరి వరకు ఏమాత్రం సడలింపులేదు. చివరకు ఉరికంబం ఎక్కినాక, ఉరిత్రాడు బిగించబోతున్న సమయంలో కూడా, **నా మాతృభూమిని విముక్తం చేయాలనుకున్నాను. ఈ ప్రయత్నం నా జీవితం అంతం కావటంతో సమసిపోదు**, అని ఆయన ప్రకటించారు.

(Just before the noose was put round his neck, he said, " I tried to make India Free, and the attempt will not end with my life ",. -The History and Culture of The Indian People Vol. XI,(Struggle for Freedom) Edited by RC Majumdar, Bharathiya Vidya Bhavan, Bombay, 1969, Page 546).

ఈ మేరకు ఆయన కవితలు కూడా అల్లారు. ఆ కవితల్లో, **నా హిందూస్థాన్‌కు స్వేఛ్ఛ లభిస్తుంది చూడండి. చాలా త్వరలోనే బానిసత్వపు సంకెళ్లు తెగిపోతాయి** (బహుత్ సీ జల్ద్ టూటేంగి గులామికి జంజీరే. కిసీ దిన్ దేఖనా ఆజాద్ ఏ హిందూస్థాన్ హోగి) అని తన ప్రగాఢ కాంక్ష వ్యక్తం చేసారు.

ఉరివేదిక మీద నుండి ఉరితాడును గౌరవంగా స్వీకరించారు. ఆ ఉరిత్రాడు మెడలో పడ్డాక, దైవ నామస్మరణ ప్రారంభించారు. ఉరితాడును ముద్దు పెట్టుకున్నారు. ఎదురుగా నిలుచున్న వ్యక్తులను ఉద్దేశించి మాట్లాడుతూ నా చేతులు ఎవరి రక్తంతో

మలినం కాలేదు. నా మీద చేసిన అరోపణలు అబద్దం. భగవంతుడు నాకక్కడ న్యాయం చేస్తాడు. అంటూ ఉరిశిక్ష అమలుకు సిద్ధమయ్యారు.

అధికారుల నుండి తలారికి సంజ్ఞ అందగానే ఉరిశిక్ష అమలు జరిగింది. ఉరితాడు అష్ఫాఖ్ మెడకు బిగుసుకుంది. భరతమాత ముద్దుబిడ్డ ప్రాణాలు అనంతవాయువులలో కలిసి పోయాయి. మాతృభూమి కోసం మరణాన్ని ఆనందంగా ఆహ్వానించిన విప్లవకారుడు అష్ఫాఖ్ తాను పుట్టిన గడ్డ పట్ల గల ప్రేమాభిమానాలను వ్యక్తంచేస్తూ, తనను మట్టి చేసేటప్పుడు తన **కఫన్** లో (మత్తులను సమాధి చేసేందుకు ముస్లింలు భౌతికకాయాన్ని చుట్టి ఉంచే ధవళ వస్త్రం) మాతృభూమి మట్టిని ఉంచుమని కవితాత్మకంగా తన కోర్కెను ప్రకటించారు. అంతిమయాత్రలో కూడా జన్మస్థలానికి దూరం కావడానికి ఇష్టపడని అష్ఫాక్ పుట్టి పెరిగిన ఊరి మట్టితో, ఆ మట్టిలో కలసిపోవాలన్న ప్రగాఢ కాంక్షను వ్యక్తం చేశారు. ఆ కవిత ఇలా సాగింది.

**నాకే కోరికా లేదు. ఉన్నదల్లా ఒక్కటే కోరిక. ఎవరైనా నా శవవస్త్రం మీద నేను పుట్టిన గడ్డ మట్టి ఉంచాలని తప్ప.** ( కుచ్ ఆర్జూ నహీం హై, హై ఆర్జూతో యహ్ హై,– రఖ్ దొ కోయీ జరా సీ ఖాకే వతన కఫన్ మేం)

అష్ఫాఖ్‌ను ఉరితీసే రోజున ఫైజాబాద్‌కు ప్రజానీకం తరలివచ్చారు. ఉరి కార్యక్రమం జైలులో జరుగుతుండడగా, భరతమాత ముద్దుబిడ్డ అష్ఫాఖుల్లా ఖాన్‌కు జోహార్లు పలుకుతూ, జైలు పరిసర ప్రాంతాలనే కాకుండా, ఫైజాబాద్ పట్టణమంతా నినాదాలతో ప్రతిధ్వనింపజేసారు. ఉరిశిక్ష అమలు చేసిన తర్వాత ఆయన బంధువులు అష్ఫాఖ్ భౌతికకాయాన్ని ఆయన స్వస్థలమైన షాజహాన్‌పూర్‌కు తీసుకువెళ్లారు.

## అమర వీరుని అంత్యక్రియలు

ఆ రోజుల్లో విప్లవకారులంటే ప్రభుత్వం ఎంతగా భీతిల్లిందంటే, ఉరిశిక్ష విధించాక కూడా ఆ ఆమర వీరుల భౌతికాయాలను సంబంధితుల పరం చేసేదికాదు. ఆ కారణంగా అష్ఫాఖుల్లా తన కుటుంబీకులకు రాసిన లేఖలో నా భౌతికకాయాన్ని అందిస్తారో లేదో అన్న అనుమానం వ్యక్తం చేశారు. ఆ విషయాన్ని ప్రస్తావిస్తూ, **నా భౌతికకాయాన్ని మీకు అందచేస్తారో లేదో నాకు తెలియదు. ప్రాణం పోయాక శరీరం మట్టిదిబ్బ మాత్రమే,** అని అష్ఫాఖ్ ప్రకటిస్తూ, తన బంధుమిత్రులను ముందస్తుగా సముదాయించారు. ఈ రకంగా చూస్తే అష్ఫాఖ్ మరణాన్ని చాలా తేలిగ్గా తీసుకున్నట్టు తెలుస్తుంది.







అష్ఫాఖుల్లా ఖాన్ ఉరిశిక్షకు సరిగ్గా ముందురోజున అనగా డిసెంబర్ 18వ తేదీన **ప్రతాప్** పత్రిక సంపాదకులు గణేష్ శంకర్ విద్యార్థికి ఒక టెలిగ్రాం పంపారు. ఆ టెలిగ్రాంలో, **డిసెంబర్ 19 మధ్యాహ్నం రెండు గంటలకు నన్ను లక్నో రైల్వే స్టేషన్‌లో కలవండి. మీరు నన్ను చివరిసారిగా కలుస్తారని ఆశిస్తాను.,** అని కోరారు. ఆ ప్రకారంగా శ్రీ విద్యార్థి తొమ్మిది మంది మిత్రుల్ని తీసుకుని ఆ రోజున లక్నో స్టేషన్‌కు వెళ్ళారు.

అమర యోధుడు అష్ఫాఖుల్లా ఖాన్ భౌతికాయాన్ని తీసుకొచ్చిన రైలు లక్నో స్టేషన్ చేరుకుంది. అష్ఫాఖ్ భౌతికకాయం ఓ రైలు కంపార్టుమెంటులో ఉంచబడి ఉంది. ఆ కంపార్ట్‌మెంట్‌లోకి శ్రీ విద్యార్థి తదితరులు ఎక్కి అష్ఫాఖ్ భౌతికకాయం మీద ఉన్న వస్త్రాన్ని తొలిగించారు. ఆయన ముఖం ప్రశాంతంగా, కళగా ఉంది. ఆయనను ఉరితీసి పదిగంటలైనా ముఖం కళగానే ఉంది. ఆయన గడ్డం బాగా పెరిగి ఉంది. ఆయన శరీరం శుభ్రంగా ఉంది. ఆయన ఉరితాడ్రును చిరునవ్వుతో స్వీకరించిన కారణంగా కాబోలు ఆయన ముఖంలో చిరునవ్వులు ఉట్టిపడుతున్నాయి. ఆయన ప్రశాంతంగా నిద్రపోతున్నట్టు, ముఖం మీద ఎంతో ప్రశాంతత నెలకొని ఉంది. ఇది అంతిమ నిద్ర. అనంతమైన నిద్ర. మరెన్నడూ మేల్కొనని సుదీర్ఘ నిద్రలో ఆయన ఉన్నారా? అనిపించేలా ఉంది.

అఫ్ఫాఖుల్లా ఖాన్ భౌతికకాయాన్ని షాజహాన్‌పూర్ తీసుకు వెళ్ళారు. అష్ఫాఖ్ కోరిన విధంగా ఆయన భౌతికాయాన్ని సమాధి చేసారు. అంత్యక్రియలకు ప్రజలు పెద్ద



స్వగ్రామం షాజహాన్‌పూర్‌లో అష్ఫాఖుల్లా ఖాన్ సమాధి

సంఖ్యలో హాజరయ్యారు. అమరవీరునికి అంతిమ శ్రద్ధాంజలి ఘటించారు. **దేశంలోని ఏడుకోట్లం ముస్లిం మతస్థులలో దేశ స్వాతంత్ర్యం కోసం ఉరికంబం ఎక్కిన మొట్ట మొదటివాడ్ని నేను. ఆ విషయం తలచుకున్నప్పుడంతా నాకు గర్వంగా ఉందని,** ప్రకటించిన అష్ఫాఖ్‌ను ఆయన పుట్టిపెరిగిన మట్టి తనలో కలుపుకుంది.

మాతృదేశం కోసం ప్రాణాలర్పించడం ఎంతో అదృష్టమని గర్వపడిన అష్ఫాఖ్ తన ఇరవై ఏడేళ్ళ వయస్సులోనే వందేళ్ళ జీవితాన్ని ముగించుకుని వందల ఏళ్ళ కీర్తిని మూటగట్టుకుని అమరలోకాలకు తరలివెళ్ళిపోయారు.

◆◆◆

**ఈ గ్రంథం నాయకుడు అష్ఫాఖుల్లా ఖాన్ కార్యక్రమాలకు సంబంధించిన కొన్ని ఊహా చిత్రాలను, భారత భారతి పుస్తకమాల (హైదరాబాదు) వారు ప్రచురించిన అష్ఫాఖుల్లా ఖాన్ గ్రంథం నుండి స్వీకరించాం. ఆ గ్రంథం రచయితకు, ప్రచురణకర్తలకు, మా ప్రత్యేక ధన్యవాదాలు.**

– రచయిత మరియు ప్రచురణకర్తలు





## ఆధార గ్రంథాలు


01. Muslims In India, Naresh Kumar Jain, Manohar, New Delhi, 1979.
02. Freedom Movement and Indian Muslims, Santimoy Ray, PPH, New Delhi,1983.
03. Who is who Indian Martyrs, Dr PN Chopra, Govt. of India Publications
04. Souvenir, Indian Institute of Objective Studies, New Delhi, 1978.
05. Gnapakam Chesukondi, Eppudina. Amara veerul Uttharaalu (Telugu), Translation by J.Lakshmi Reddy, Govt. of Indian Publications, New Delhi, 1998.
06. Bismil Athma Kadha, Ramprasad Bismil, Translated by Inguva Malli karjuna Sarma, Marxist Adhayana Vedika, Hyderabad, 1989.
07. Freedom Movement In India, Dr. Tara Chand, Govt. of India Publications, New Delhi, 1992.
08. Noorjahan Monthly (English), Aug. 1999, Hyderabad.
09. Geeturai Weekly, (Telugu), Aug. 1999, Hyderabad.
10. Bharatha Swathantrodyamam: Muslimlu, (Telugu) Syed Naseer Ahamed, Azad House of Publications, 1999.
11. Shaheed Ashafhaqulla Khan our Unkaa Yug (Hindi), Sudheer Vidyardhi, Allahabad, 1980.
12. Prajasahithi, Monthly (Telugu), December 2000, Vijayawada.
13. Great Revolutionary Martyr Ashafhaqulla Khan, Basha Sangam, Allahabad, 2001.
14. Remembering Ashfhaqulla Khan - A forgotten Revolutionary (English). KK Khullar, 2000.
15. Ashfhaqulla Khan, SP Sankaranarayana Rao, Translated by Hyndavi, Bharatha Bharathi Pusthkamala, Hyderabad, 1998.
16. Encyclopedia of Muslim Biography, Nagendra Kumar Singh APHPC, New Delhi, 2001.
17. Muslims and India's Freedom Movement, Shan Muhammad, IOS, New Delhi, 2002
18. Struggles for Freedom, RC Majumdar, BVB, Bombay, 1969.